Founder B.V. Radhakrishna

# బాలమిత్ర

బాలల సచిత్ర మాసపత్రిక

సహాయ సంపాదకుడు : బి.ఆర్. వరదరాజులు

సంపుటి : 66 జనవరి 2013 సంచిక: 1

గత సంవత్సరం మనతో కష్ట సుఖాలు పంచుకుని వీడ్కోలు పలికింది.

నేడు మనం నూతన సంవత్సరంలో అడుగు పెట్టాం! ఈ సంవత్సరం మీకు సకల శుభాలు, సకల ఐశ్వర్యాలూ కలుగాలని ఆశిస్తూ....

"బాలమిత్ర" పాఠకులకు, రచయిత(త్రు)లకు, ఏజెంట్లకు, ప్రకటన కర్తలకూ, శ్రేయోభిలాషులకూ, ప్రతి ఒక్కరికీ మీ 'బాలమిత్ర'

**నూతన ఆంగ్ల సంవత్సర శుభాకాంక్షలు**

తెలుపుకుంటోంది.

విడిప్రతి : రూ.15/- 64 పేజీలు

# ఔన్నత్యం



ఒకసారి కబీరు ఇంటికి రాత్రి సమయంలో ఓ బాటసారి వచ్చాడు. కబీరు అతనికి భోజనం పెట్టి, రాత్రి విశ్రాంతి తీసుకుని ఉదయం వెళ్ళమని చెప్పి పడుకోడానికి ఖరీదైన కంబళ్ళు ఇచ్చాడు.

కంబళ్ళపై పడుకున్న బాటసారికి, వాటిని తనతో తీసుకుపోవాలని ఆలోచన రాడంతో, అర్ధరాత్రి ఎవ్వరికీ చెప్పకుండా ఆ కంబళి తీసుకుని బయలుదేరాడు.

ఆ సమయంలో తిరుగుతున్న సైనికులు కంబళ్ళతో వస్తున్న క్రొత్త వ్యక్తిని చూసి దొంగగా అనుమానించి, పట్టుకున్నారు. రాజభటులను చూసి అతను భయంతో తాను కబీరు ఇంటి నుండి వస్తున్నట్లు తెలిపాడు. వాళ్ళు అతన్ని కబీరు ఇంటికి తీసుకుపోయారు.

అంతా తెలుసుకున్న కబీరు వారితో, "ఇతను నాకు తెలిసిన వ్యక్తి. కంబళ్ళు కావాలంటే ఇచ్చాను. ఇతన్ని వదిలేయండి" అనడంతో రాజభటులు వెళ్ళిపోయారు.

బాటసారి కబీరు ఔన్నత్యం చూసి కన్నీరు కారుస్తు "నన్ను క్షమించండి. మీరు నా ఆకలిని తీర్చి వుండటానికి చోటుకూడ ఇచ్చారు. కాని నేనేమో మీకు చెడును చేసినా అదంతా చెప్పకుండా నన్ను కాపాడారు అంటూ" ఆయన కాలమీద పడ్డాడు.

బి. రాజ్యలక్ష్మి, వరంగల్



# అన్నిటికంటే ఇష్టమైనది

అక్బర్ చక్రవర్తికి చాలామంది భార్యలు వుండేవారు. వారిలో ఒక రాణి పరమ గయ్యాళి. ఆమె మీద చాలా మంది అక్బర్‌కు ఫిర్యాదులు కూడా చేసారు. ఒకనాడైతే ఆమె అక్బర్‌తో చాలా మొరటుగా మాట్లాడింది. దానితో ఆయనకు విపరీతంగా కోపం వచ్చి, "నువ్వు వెంటనే మీ పుట్టింటికి వెళ్ళిపో" అని ఆజ్ఞాపించాడు.

ఆవేశంలో ఏదో అన్నది కాని ఆయన వెళ్ళి పొమ్మనేసరికి ఒక్కసారిగా దుఃఖం పెల్లుబికి వచ్చింది. "నా మాటలకు, చేతలకు సిగ్గుపడుతున్నా. దయచేసి క్షమించి నన్ను మా పుట్టింటికి పంపొద్దు" అని వేడుకుందామె. అక్బర్‌కు కూడా జాలి కలిగింది. కానీ యిచ్చిన ఆజ్ఞను ఉపసంహరించటం ఎట్లా? అందుకే, "నువ్వు వెళ్ళేటప్పుడు నీకు అన్నిటికంటే యిష్టమైన దాన్ని తీసుకెళ్ళొచ్చు" అని కొంచెం సడలించాడు. చక్రవర్తి తనను క్షమించదని ఆమెకు అర్థమైంది. కానీ ఏం చెయ్యాలో అర్థం కాలేదు. ఆఖరికి ఆమెకు బీర్బల్ గుర్తుకొచ్చాడు. అతని సహాయం కోరాలనుకుంది కానీ ఆమె అతణ్ణి కూడా గతంలో ఎన్నోసార్లు దూషించింది. ఏ ముఖం పెట్టుకుని అడగగలదు?

ఏది ఏమైనప్పటికి ఆమె అతని కోసం కబురు పంపగానే వచ్చాడు.

"బీర్బల్, నాకు నీ సహాయం అత్యవసరంగా కావాలి. కానీ నిన్ను సహాయం అర్థించటానికి సిగ్గుపడుతున్నా" అంది పశ్చాత్తాపం నిండిన స్వరంతో.

"బేగం సాహెబా, గతం మర్చిపోండి. దయచేసి నేను మీకు చేయగల సహాయం ఏంటో చెప్పండి" అన్నాడు బీర్బల్ సహృదయంతో.

మేకల మదన్ మోహన్ రావు, మిర్యాలగూడెం

ఆమె జరిగిందంతా పూసగుచ్చినట్లు వివరించింది. అంతావిని, కొంచం సేపు ఆలోచించి, "....ఇలా చేయండి" అని ఆమెకు గుసగుసగా చెప్పాడు.

ఆ బేగం ఆ సలహాను ఎంతో సంతోషించింది. ఆ తర్వాత ఆమె ఆ సాయంకాలం, తాను మరునాడే వెళ్ళిపోతున్నానని, యీ సాయంత్రం చివరిసారిగా తన ఆతిథ్యం స్వీకరించమని అక్బర్‌కు కబురు పంపింది. ఆ ప్రకారమే ఆమె మందిరానికి వచ్చేసాడు అక్బర్.

"నా సామాన్లన్నీ సర్దుకున్నాను. ఈ షర్బత్ మీ కోసం ప్రత్యేకంగా తయారు చేసాను. దయచేసి తాగండి" అని అడిగింది బేగమ్. బేగమ్ తన ఆజ్ఞ ప్రకారం వెళ్ళిపోతున్నందుకు సంతోషించిన అక్బర్, ఆమె యిచ్చిన షర్బత్ తాగాడు. కొద్ది సేపట్లోనే మైకం కమ్మినట్లయి, మత్తుగా నిద్రపోయాడు.

అప్పటికే అన్ని ఏర్పాట్లు పూర్తి చేసుకున్న బేగమ్, నిద్రపోతున్న అక్బర్‌ను పల్లకీలోకి చేర్పించింది నౌకర్లతో. తాను కూడా ఎక్కి కూర్చుని పుట్టింటికి ప్రయాణమైంది.

మరునాడు పొద్దున మెలకువ వచ్చిన అక్బర్‌కు పరిసరాలన్ని కొత్తగా తోచడంతో, "ఏంటిది? ఎక్కడున్నాను?" అన్నాడు ఆశ్చర్యంగా.

అతణ్ణే కనిపెట్టుకుని వున్న బేగం, "మందిరంలోనే వున్నారు ప్రభూ!" అంది.

"కానీ యిది మా మందిరం కాదే?" అన్నాడు అక్బర్ సందేహంగా, కిటికీలోంచి బయటికి చూస్తూ.

"ప్రభూ, మీరు నన్ను మా పుట్టింకి నా అత్యంత ప్రీతి పాత్రమైన దాన్ని తీసుకుని పొమన్నారు కదా. నా కత్యంత యిష్టమైంది మీరే కాబట్టి మిమ్మల్ని తీసుకుని మా పుట్టింటికి వచ్చాను" అంది.

ఆ మాటలకు ఆయన కోపం పోయింది. బీర్బల్ తప్ప ఆమెకు ఇలాంటి సలహా మరెవరూ యిచ్చి వుండరని ఆయనకు తెలిసి నవ్వుకున్నాడు.






# దక్షిణ

బాబా భక్తులకు సద్భోవన బోధిస్తుండగా భక్తుల మధ్య కలకలం ఏర్పడడంతో బాబా అటు వైపు చూసాడు. ఎవరో ధనవంతురాలులా వుంది. ఖరీదైన కారులో నుండి దిగి బాబా వద్దకు వస్తుంది. ఆమె వెనుక ఇద్దరు నౌకర్లు రెండు బిందలు మోసుకుని వస్తున్నారు.

ఆమె వస్త్రాధారణ, నగలు చూసి భక్తులు భయంతో ప్రక్కకి తొలగడంతో, ఆమె తిన్నగా బాబా వద్దకు వచ్చి నమస్కారం చేసి, "బాబా! నేను ఈ నగరంలో గొప్ప పారిశ్రామిక వేత్తను. మీ బోదనలు నాకు బాగా నచ్చింది. అందువలన మీకు మంచి కానుక ఇవ్వాలనుకుని వచ్చాను. అదీ ఇంతవరకు మీరు కని విని ఎరుగని విధంగా, ఏ భక్తుడు ఇవ్వనంత దక్షిణ తెచ్చాను. దయచేసి స్వీకరించండి" అంటూ నౌకర్లని పిలిచింది.

వెంటనే భక్తులు తాము మోసుకొస్తున్న బిందెలు క్రిందికి దించి, దానిపై మూతలను తీసారు. ఆ బిందెల నిండా బంగారునాణాలు వుంది.

వెంటనే బాబా అతని వంక చూసి, "అదా బంగారం? లేక ఇదా" అంటూ తనపై బట్ట తీసి గుండెల్ని చూపాడు. అపుడు బాబా దేహం బంగారంకన్నా మిన్నగా వేయి రెట్లకాంతిలో మెరుస్తుంది.

మరుక్షణం ఆ భక్తులు, "క్షమించండి బాబా! మీ హృదయమే మేలిమి బంగారం. నా అజ్ఞానానికి మన్నించండి" అంటూ బాబా కాళ్ళ మీద పడ్డాడు.

ఆ తరువాత బాబా ఆ యువతి వైపు చూసి, "ఇలా రామ్మా" అన్నారు. బాబా ఆమె చేతిలో మూడు తమలపాకులు, కాస్త విబూధి, రెండు

ఆర్. కవిత, వరంగల్

రూపాయలు పెట్టి, "అమ్మా! నువ్వు మాకు ఏం బాకీ లేవు. నువ్వు తెచ్చిన కానుకలు తీసుకుని వెళ్ళు" అన్నారు.

ఆమె ఏమీ మాట్లాడలేక వింత కాంతిలో మెరుస్తున్న బాబాకి నమస్కరించి, తెల్లబోయిన వదనంతో బాబాకు నమస్కరించి తాను తెచ్చిన కానుకలతో వెళ్ళిపోయింది.

కాని బాబా ముందు కూర్చున్న భక్తులకు మాత్రం బాబా ఆ బంగారం ఎందుకు తీసుకోలేదో తెలుసుకోవాలని. "బాబా! మీకు నిజంగా ధనం అక్కర్లేదా. నేను మీ వద్దకు వస్తున్న కొందరి భక్తుల వద్ద మీరు కావాలని అడిగి మరీ రెండు రూపాయలు, ఒక రూపాయి తీసుకుని సాయంత్రం అందరికీ పంచి పెడతారు కదా. మీకు ఏ శ్రమ లేకుండా ఇంత విలువైన కానుక మీ వద్దకు వచ్చినపుడు, దాన్ని తీసుకుని మిగతావారికి పంచవచ్చు కదా" అన్నాడు.

బాబా నవ్వి, "నేను ఏదీ ఉచితంగా తీసుకోను. పూర్వ జన్మలలోనూ లేక ఈ జన్మలోనూ దేవతలకు ఆపదలో మొక్కలు పెట్టి, ఆపద తీరగానే మరిచిన వారి నుండి ధక్షిణ తీసుకుని దేవతలకు అర్పించి, వారి దోషాన్ని పోగొడుతున్నాను. అలాగే శని దోషాలు కలవారి నుండి దక్షిణ తీసుకుని, ఆ సొమ్ముతో నూనె కొని, దీపారాధన చేసి, వారి దోషాలు పోగొడుతున్నాను. ఇపుడు వచ్చిన ధనికురాలకు ఏ విధమైన మొక్కలు లేవు. ఇంతకు జన్మలో ఎవ్వరికి బాకీ లేదు. అందువలన ఆమె వద్ద ఏమీ తీసుకోక, ఆమె సద్బుద్ధికి మెచ్చి నేను కానుకగా రెండు రూపాయలు ఇచ్చాను. మీరు జాగ్రత్తగా వుండండి. ఏదైనా మొక్కలు వుంటే వెంటనే చెల్లించండి" అన్నారు.

అపుడు అందరికి బాబా దక్షిణలోని ఆంతర్యం అర్థమైంది.






"రాజు! ఈ రోజు మన వూరిలో బంద్ చేయమని నాయకుడు చెప్పాడు" అని శ్రీనివాస్ చెప్పడంతో, రాజు, "బంద్ ఎందుకు చేయ మన్నారు" అని అడిగాడు.

"ఆ సంగతి మనకెందుకు. సాయంత్రానికి మన నాయకుడు మనకి డబ్బు ఇస్తాడు" అని చెప్పి రాజు కొందిరి మిత్రులతో బయట తిరుగుతూ తెరిచి వున్న దుకాణాలను బలవంతంగా మూయించసాగాడు. ఆ సమయంలో ఒక వ్యక్తి స్కూటర్‌పై అటూ రాసాగాడు. అది గమనించిన రాజు స్నేహితులతో కలసి, ఆ వ్యక్తిని ఆపి, "ఈ రోజు బంద్ వెనక్కి తిరిగి వెళ్ళండి" అన్నాడు.

ఆ వ్యక్తి తాను అవసరంగా వెళ్ళాలని వారిని ఎంతో బ్రతిమాలినా, వాళ్ళు వినలేదు. రాజు కోపంతో ఆ స్కూటర్ టైర్లకున్న గాలిని తీసి, "మంచిగా చెబితో విననంటున్నావు. ఇపుడు స్కూటర్‌ని తోసుకుంటూ ఇంటికి వెళ్ళు" అనడంతో, ఆ వ్యక్తి బాధతో వెళ్ళాడు.

మధ్యాహ్నమైంది. అందరు భోజనాలకని ఇళ్ళకు వెళ్ళుచున్నారు. రాజు తాను గొప్ప పని చేసినవాడిలా సంతోషంగా గెంతుతూ ఇంటికి వెళ్ళాడు. ఇంటి బయట కంగారుగా వున్న చెల్లి, "అన్నయ్యా! అమ్మకి జ్వరం ఎక్కువగా వుంది. హాస్పిటల్‌కు వెళ్ళాలంటే బంద్ వలన ఏ వాహనం లేదు. నువ్వు వెళ్ళి డాక్టర్‌ని తీసుకురా. ఆలశ్యమైతే కష్టం" అనడంతో, రాజా అలాగే వెనక్కి తిరిగి పరిగెత్తాడు.

రాజా వూరంతా తిరిగాడు. డాక్టర్లు వున్నారు, కాని బంద్ వలన బయటకి రావడానికి భయపడ్డారు. ఆఖరికి చిన్న ఇంటి ముందు డాక్టర్

ఎ. హేమలత, నెల్లూరు

ప్రకాష్ అన్న బోర్డు కనిపించడంతో, ఆయన తప్పక తన ఇంటికి వస్తాడన్న ఆశతో ఆ ఇంటి తలుపులు తట్టాడు. ఒక ముసలాడు తలుపు తెరిచి, రాజా ద్వారా సంగతి తెలుసుకుని, "భయపడకు. మా వాడు చాలా మంచివాడు. అర్ధరాత్రి అయిన రోగి ఇంటికి వెళతాడు. వుండు పిలుస్తాను" అంటూ లోపలికి వెళ్ళాడు.

లోపల నుండి డాక్టర్ బయటికి వచ్చారు. ఆయన్ని చూడడంతో రాజా నిర్ఘాంతపోయాడు. ఆయన ఎవరో కాదు ఉదయం స్కూటర్ మీద వస్తుంటే, తాను అడ్డుపడి టైరు గాలి పీకి పంపిన వ్యక్తి. "ఆయన ఎందుకు తనకి సహాయం చేస్తాడు" అని బాదపడతూ రాజు వెనుతిరిగాడు. అంతలో డాక్టర్, రాజుని పిలిచి విషయం అడగడంతో రాజు ఏడుస్తూ ఆయన కాలిపైపడి తల్లి సంగతి చెప్పాడు.

వెంటనే డాక్టర్ తన మందుల పెట్టె తీసుకుని కాలి నడక మీద రాజు ఇంటికి వచ్చి, అతని తల్లిని పరీక్షించి, తగిన మందులు ఇచ్చాడు. కొంత సేపటికి ఆమెకు జ్వరం తగ్గింది.

రాజు, డాక్టర్ చేతులు పట్టుకుని, "నన్ను క్షమించండి. ఉదయం మిమ్మల్ని అంత అల్లరి చేసినా, మనసులో పెట్టుకోకుండా మా అమ్మకు వైద్యం చేసారు. నిజంగా మీరు దేవుడు" అన్నాడు.

డాక్టర్ అతని భుజంపై తట్టుతూ, "బంద్ అన్నది ఎందుకు చేయాలి. ఆ నాయకులు వారి స్వార్ధం కొరకు మీలాంటి వారితో ఇలా చేపిస్తుంటారు. కాని దాని వలన ఎందరు నష్టపోతారో అన్నది ఎవ్వరు ఆలోచించరు. ఈ రోజు నీకు వచ్చిన కష్టం ఇంకా ఎందరికి వచ్చిందో. మరి వారి పరిస్థితి ఆలోచించావా. ఇకపై ఎవరి మాటలు విని ఇలా బంద్‌లు చేయకు. చక్కగా చదువుకో. నలుగురికి ఉపయోగపడు. నువ్వే కాదు నీ స్నేహితులు మారాలి. అపుడు మన దేశం బాగా అభివృద్ధి చెందుతుంది" అని వెళ్ళిపోయాడు.





# తొమ్మిది నుండి తొంబై

భళ్లున తెల్లవారింది. బెడ్ మీద కామేశ్వరం కళ్లు విప్పగానే హరీష్ గుర్తుకు వచ్చి రాత్రి చెప్పిన విషయం ఏం చేసాడో తెలుసుకోవాలన్న ఆతృతతో టేబిల్ మీద ఉండే సెల్లు కోసం వెతికాడు. అది కనబడలేదు. పొరపాటున హేండ్ బ్యాగులో గాని పెట్టేసానేమో అని బ్యాగు తెరిచి చూసాడు. కనబడలేదు. ఆశ్చర్యం కలిగి చిన్న చిన్న శబ్దంతో ఒకటీ ఒకటీ వెదకడం మొదలు పెట్టాడు.

ఆ శబ్దాలుకి కావేరి నిద్ర విరిగి కళ్లు విప్పి, "ఏంటండీ అలా వెతుకుతున్నారూ?" బద్ధకంగా అంది.

"ఏమౌంతుంది. ఏమిటి? రాత్రి సెల్లు ఈ టేబిల్ మీద పెట్టింది బాగా గుర్తు. ఇప్పుడు చూస్తే కనబడడం లేదు. ఈ ఇంట్లో ఏ సామాను ఎక్కడ పెట్టింది అక్కడ ఉండి చావదు కదా! నేను ఎప్పుడూ చెపుతుంటాను సీరియల్సు చూడడానికి వచ్చేపోయే పిల్లలు మీద ఓ కన్నువేసి ఉంచు అని. పట్టించుకుంటేగా!" ఆవేశంగా అన్నాడు.

కావేరికి ఒళ్లు మండింది. "బాగుంది వరస. ఎక్కడ ఏదీ కనబడకపోయినా బాగా నా మీద విరుచుకుపడడం మీకు అలవాటైపోయింది. బాగా వెతకండి. ఎన్నిసార్లు నా మీద విరుచుకుపడిన సామానులు మీకు దొరికి సారీ చెప్పారో ఒక్కసారి గుర్తుకు తెచ్చుకోండి!" తిరిగి ముసుగు తన్ని పడుకుంది. అప్పుడే మడి బట్టలుతో చేరిన బామ్మ కామేశ్వరంతో "ఒరేయ్ కాముా" కోవెలలో ఆచార్యులుగారుంటారు. ఒక్కసారి ఈ నెంబరుకి ఫోను చేసి మా బామ్మ సీరియల్ చూసి వస్తుంది. అంతవరకూ అభిషేకాలు కొంచెం ఆపమను" అని చిన్న కాగితం మీద ఉన్న నెంబరు అందించింది.

ఆరుపల్లి గోవిందరాజులు, విశాఖపట్నం.

కామేశ్వరం ఒక్కసారి ఉలిక్కిపడి "కాలం ఎంత మారిపోయింది అనుకొని" ఒసేయ్... బామ్మ సెల్లు కనబడక లేచింది మొదలు వెతుకుతున్నాను. నువ్వు గాని చూసావా?" ఆతృతగా అడిగాడు. బామ్మ ఒక్కసారి ఖంగుతిని "అదేవిటిరా అలా వుంటావూ రాత్రి నేను నీ సెల్లుతో కామాక్షమ్మతో ఓ పది నిముషాలు మాట్లాడుతున్నప్పుడు ఠక్కున ఆగిపోయింది. బ్యేలన్సు నొక్కి చూస్తే జీరో అని వస్తే ఇక్కడే పెట్టేసాను. ఇంతలో ఎలా మాయమయ్యింది" బామ్మా కూడా ఆశ్చర్యపోయింది.

అప్పుడే అక్కడకు చేరిన పేపరు బాయ్ అంతా విని తన సెల్లు తీసి "సార్... దీనితో మీ సెల్లు నెంబరుకి ఫోను చెయ్యండి. రింగవుతే ఏ మూల ఉందో తెలిసిపోతుంది" అని సెల్లు చేతికి అందించాడు.

కామేశ్వరం "గుడ్ ఐడియా!" ఆ అబ్బాయిని మెచ్చుకొని తన సెల్లు నెంబరుకి రింగు చేసి ఆతృతగా సెల్లు చెవి దగ్గరపెట్టాడు. శబ్దం చక్కగా వినబడింది. నిదానించగా అది బాత్‌రూంలో నుండి వస్తున్నట్లు గ్రహించి వెళ్లి తలుపు తోసాడు. గడియ పెట్టి ఉంది. "అరేయ్..... చంటీ" అన్నాడు కోపంగా.

గడియ ఠక్కున విడింది. దాడి చేతిలో సెల్లు చూసి "ఇక్కడేం చేస్తున్నావు? నీ చేతిలో సెల్లు ఏమిటి?" అన్నాడు.

చంటీ ఒక్కసారి బితుకు బితుకుమంటూ "కోప్పడకండి డాడీ. నిన్న స్కూలుకి వెళ్లలేదుకదా! హోం వర్కు ఏం ఇచ్చారో తెలీదు. కావ్యని అడిగి తెలుసుకొని చేయాలని సెల్లు తీసుకొచ్చాను. టీచరు హోంవర్కు చేయలేదంటే చంపేస్తుంది" అన్నాడు. కామేశ్వరం ఒక్కసారి "అంతా కాల మహిమ... ఈ రోజుల్లో తొమ్మిది సం॥ల పిల్లల నుండి తొంబై సం॥ల వారికి సహితం ఎంతో అవసరమై పోయింది" అనుకున్నాడు.



# అల్లుడి అదృష్టం



భద్రయ్య కూతురు సీత పెళ్ళికుదిరింది. ఊళ్ళోనే వున్న ధర్మయ్య కొడుకు శివయ్య వరుడు. భద్రయ్య పెళ్ళి ఖర్చులకు, కట్నం ఇవ్వడానికి తను వుంటున్న పెంకుటిల్లు అమ్మడానికి పెట్టాడు.

ఇంటి పక్కనే వున్న శాంతయ్య తనకి కలిసి వస్తుందని కొనడానికి ముందుకు వచ్చి కొంత డబ్బు బయానాగా ఇచ్చాడు.

కాని భద్రయ్యంటే పడని గోపయ్య ఆ ఇంటికి వాస్తు సరిగ్గా లేదనీ, కొంటే అరిష్టమనీ భయపెట్టాడు. శాంతయ్య భయపడి తను ఆ ఇల్లు కొనలేనని బయానాగా ఇచ్చిన డబ్బు తిరిగి తీసుకున్నాడు.

భద్రయ్య నిరుత్సాహపడ్డాడు. ధర్మయ్య దగ్గరికి వెళ్ళి పెళ్ళి వాయిదా వెయ్యమని కోరాడు. ఇల్లు అమ్ముడైతే తప్ప కట్నం ఇవ్వలేనని అసలు విషయం చెప్పాడు.

అప్పుడు వరుడు శివయ్య ముందుకు వచ్చి, "నాన్నా! కట్నం బదులు ఆ ఇల్లు నేను తీసుకుంటాను. పెళ్ళయిన తర్వాత అన్నయ్య మీ దగ్గర వుంటాడు. నేను ఆ ఇంట్లో కాపురం వుంటాను" అన్నాడు.

"ఆ ఇల్లు చాలా పాతబడింది గదా?" అని సందేహం వెలిబుచ్చాడు ధర్మయ్య.

"ఆ ఇల్లు వున్న స్థలం మంచి కూడలిలో గ్రామం మధ్యలో వుంది నాన్నా! నేను దాన్ని

పడగొట్టి ఇంటితో పాటు దుకాణం కట్టిస్తాను. వ్యాపారానికి అనుకూలంగా వుంటుంది" అని తండ్రికి నచ్చజెప్పాడు శివయ్య.

ధర్మయ్య కొడుకు అభిప్రాయంతో ఏకీభవించాడు. పెళ్ళయిన తర్వాత భద్రయ్య ఇంటిని అల్లుడికి అప్పగించి తను పట్నంలో వున్న కొడుకు దగ్గరకు వెళ్ళిపోయాడు.

తర్వాత శివయ్య పెంకుటిల్లు పడగొట్టించాడు. కొత్త ఇల్లు, దుకాణం కట్టించడానికి పునాదులు తవ్వుతుంటే లంకెబిందె దొరికింది. దాన్నిండా బంగారు కాసులున్నాయి.

శివయ్య పట్నం వెళ్ళి మామగారిని కలుసుకుని ఇంటి పునాదుల్లో లంకె బిందె దొరికిందనే సంగతి చెప్పాడు.

"మావయ్యా! ఆ లంకెబిందె మీ పూర్వీకులదై వుంటుంది. అందులో బంగారం మీకు చెందుతుంది తీసుకోండి" అన్నాడు శివయ్య.

భద్రయ్య నవ్వి "అదంతా నీ అదృష్టం అల్లుడూ. అదే నేనా ఇల్లు శాంతయ్యకు అమ్మి వుంటే లంకె బిందె బైట పడినా, నాకు చెప్పేవాడా? తిరిగి ఇచ్చేవాడా? ఇల్లు కొనడానికి బయానాగా డబ్బులు ఇచ్చి తిరిగి తీసుకున్నాడంటే, మా పెద్దల ఆస్తి బైటకు పోకుండా వుండటానికే అనుకుంటాను. ఇదంతా ఆ దేవుని దయ. నీ అదృష్టము కాబట్టి ఆ బంగారం నీదే" అని లంకెబిందె తీసుకోవడానికి తిరస్కరించాడు.

శివయ్య సంతోషించాడు.

సిహెచ్. శివరామ ప్రసాద్, హైదరాబాద్





# జీవనాధారం

వెంకటాపురంలో రామశాస్త్రి మంచి పేరుగల పౌరోహిత్యపు బ్రాహ్మణుడు. ఆ వూరే కాదు. చుట్టు ప్రక్కల వున్న అన్ని గ్రామాలకు కూడా ఆయనొక్కరే పురోహితుడు.

గృహ ప్రవేశం, పెళ్ళి, వ్రతాలు లాంటివాటికి, ముహూర్తాలు పెట్టించుకోడానికి, ఎవరు వచ్చిన రామశాస్త్రి వారి బలహీనతను కనిపెట్టి వారి చేత దానాలు శాంతిపూజలు లాంటివి చెప్పి, అన్నీ చేయించి భారీగా సంభావనలు పుచ్చుకునేవారు.

ఒక రోజున రామశాస్త్రి ఏదో పనిమీద బజారు వైపు వెళుతూ చంద్రన్న ఇంటి ముందు కట్టివున్న తెల్లని పాడి ఆవును చూసాడు. ఆ ఆవు పుష్టిగా వుంది. బాగా పాలు ఇచ్చేలా వుంది. రామశాస్త్రి కన్ను ఆవు మీద పడింది. సరిగ్గా ఆ సమయంలో ఇంట్లో నుండి చంద్రన్న బయటికి వచ్చి, 'దండాలు బాబయ్యా' అని పలకరించాడు. "ఏమోయ్! చంద్రన్నా, ఎలా వున్నావు. ఇంట్లో అందరూ బాగున్నారు కదా!" అంటూ శాస్త్రి ఆప్యాయంగా పలకరించాడు.

"ఏదో తమరి దయవలన బాగానే వున్నాం. కానీ..." అంటూ ఆపాడు చంద్రన్న.

"ఏమైందీ చంద్రన్న! ఏదైనా వుంటే అడుగు. నీకు నా చేతనైన సహాయం చేస్తాను" అంటూ శాస్త్రి ఆవును చూడసాగాడు.

"మరేం లేదండీ. ఈ మధ్య మా ఇంటి దానికి ఏదో పీడకలలు వస్తున్నాయి. ఏం చేయాలో తెలియ లేదు. రోజు మా ఆవిడ మిమ్మల్ని కలిసి, ఇది చెప్ప మంటుంది. మిమ్మల్ని కలవాలని బయటికి వచ్చాను. ఎదురుగా మీరు వున్నారు" అన్నాడు చంద్రన్న.

"అన్నిటికి పరిష్కార మార్గాలు వున్నాయి. ఇంతకీ ఎలాంటి కలలు వస్తున్నాయి?" అడిగాడు శాస్త్రిగారు.

డా॥ ప్రియ, హైదరాబాద్

"ఓ రోజు తను నూతిలో పడి చచ్చిపోయినట్లు, ఇంకో రోజు దయ్యాలతో తిరుగుతున్నట్లు, ఒకసారి బంగారం, డబ్బు మోసుకొస్తున్నట్లు కలలు వచ్చాయి. కలలో బంగారం డబ్బు కనిపిస్తే అమ్మవారికి బలి ఇవ్వాలని ఓ పెద్ద మనిషి చెప్పాడు. మీరు దీనికి మంచి మార్గం చెప్పండి. మీరు ఏం చెబితే అది చేస్తాను" అన్నాడు చంద్రన్న.

"నువ్వన్నది నిజం. బంగారం కలలో వస్తే ఇంట్లో ఎవరికో ఆయువు మూడిందని అర్థం" అని శాస్త్రి అతని భయాన్ని ఎక్కువ చేసాడు.

"మీరు ఏదో పూజలు చేసి మిమ్మల్ని కాపాడుతారని మీ వద్దకు వస్తే మీరు అదే చెబుతున్నారు. మాకు దారి చూపండి" అన్నాడు.

"నువ్వన్నట్లు ఇంకా చాలా పరిష్కారాలు వున్నాయి. మీ ఇద్దరి ప్రాణాలు కాపాడుకోవాలంటే, భూదానం, సువర్ణ దానం, గోదానం ఇలా ఏదైనా ఒకటి చేయవచ్చు. ఒక్కొక్క పీడకలకి ఒక్కోదానం చేస్తారు. నువ్వు పేదవాడివి భూదానం చేయలేవు. సువర్ణదానం చేయాలన్నా ఎక్కువ డబ్బు కావాలి. నీ వద్ద లేదు. పోనీ గోదానం చేస్తావా" అన్నాడు శాస్త్రి.

"గోదానం అంటే మా ఆవును ఎవరికైనా దానం చేయాలి కదా!" అనుమానంగా అడిగాడు.

"అవును నువ్వు నీ భార్య ఆరోగ్యంగా వుండాలంటే నీ ఆవును దానంగా ఇస్తే మీ కష్టాలు అన్నీ పోయి నువ్వు సంతోషంగా వుండగలుగుతావు" అన్నాడు శాస్త్రి.

"అది చాలా కష్టం. ఆవు మా జీవనాధారం. నాకు దున్నుకోడానికి పొలాలు లేవు. ఆవుపాలు



అమ్మి మా ఇద్దరి కడుపులు నింపుకుంటున్నాము. ఇపుడు ఆవును దానం ఇస్తే మేము ఎలా బ్రతకాలి" అన్నాడు చంద్రన్న.

"అవును దానం చేయాలంటే బోలెడంత తతంగం వుంది. నాకు ఆవును దానంగా ఇస్తే పూజలకు నీ వద్ద ఒక్క రూపాయి తీసుకోను. అన్ని ఖర్చులు నేనే భరిస్తాను. వేరే వారైతే కొన్ని వేల రూపాయలు ఖర్చు అవుతుంది"అన్నాడు శాస్త్రి.

చంద్రన్న ఆలోచిస్తుండగా లోపల నుండి అతని భార్య వచ్చి, ఇంకా ఎందుకు ఆలోచిస్తున్నావు. పంతులు గారు చెప్పినట్లు గోదానం చేస్తాం. మన ఆ ఆరోగ్యం ముఖ్యం" అనగానే చంద్రన్న సమ్మతించాడు.

వారం తిరక్కుండానే గోదానం పేరుతో చంద్రన్న ఆవు శాస్త్రి ఇల్లు చేరింది. ఆ నెలంతా శాస్త్రిగారికి పెళ్ళిళ్ళు హడావిడి. వూపిరి సలపలేదు. అందరివద్దా డబ్బు, బంగారం శాస్త్రి బాగా సంపాదించాడు.

ఆ రోజు రాత్రి తాను సంపాదించిన బంగారం, డబ్బు అంతా లెక్కపెట్టి, పెద్ద గోనె సంచిలో మూట కడుతుండగా ఎవరో తలుపు కొడుతున్న శబ్దం విని, తలుపులు తెరిచాడు. బయట నుండి నలుగురు దొంగలు కత్తులతో లోపలికి వచ్చి, "మీ వద్ద వున్న డబ్బు అంతా ఇవ్వండి" అని అరిచారు.

"అయ్యో! నేను పేద బ్రాహ్మడిని నా వద్ద ఏం డబ్బు వుంటుంది. మీరు వేరే ఇల్లు చూసుకోండి" అన్నాడు శాస్త్రి.

"అయితే ఆ మూటలో ఏముంది?" అంటూ ఒకడు మూట వద్దకు వెళుతుండగా శాస్త్రి అడ్డుపడి, "ఇది బియ్యంమూట మీకు డబ్బు కావాలంటే ఇస్తాను" అంటూ తన బొడ్లో దోపి వున్న వెయ్యి రూపాయలు ఇచ్చాడు.

అంతలో మరొకడు, "మనం కష్టపడి వచ్చింది ఈ వెయ్యి రూపాయల కొరకా. ఆ బియ్యం మూట తీసుకు వెళితే నెల రోజులు మన కడుపులు నిండుతాయి" అంటూ మూటను పట్టుకున్నాడు. శాస్త్రి భయంతో అడ్డుపడడంతో, మూట జారి క్రిందపడి లోపల వున్న బంగారం, డబ్బు బయట పడింది. శాస్త్రిని బాగా తన్ని ఆ మూటను తీసుకుని పారిపోయారు.

ఆ తరువాత శాస్త్రి ఏడుస్తూ, "నేను గ్రామ ప్రజలను అంతా మోసం చేసి సంపాదించినది. దొంగలు సులభంగా దోచుకున్నారు. నాకు దేవుడు తగిన బుద్ధి చెప్పాడు" అని పశ్చాత్తాపం పడ్డాడు.

శాస్త్రి ఇంట బంగారం డబ్బు మూటతో పరిగెత్తుకుపోతున్న దొంగలు చంద్రన్న ఇంటి ముందు వెళుతుండగా, వారి మూటలో వున్న యాభై వేల రూపాయల కట్ట ఎగిరి, ఆవు పోయిందన్న దిగులుతో కూర్చున్న చంద్రనపై పడింది. ఉలిక్కిపడిన చంద్రన్న నోట్ల కట్ట చూసి ఆనందంతో ఆవు ద్వారా తన ఇంటిపీడని లాక్కుని, తన జీవనాధారం కొరకు ఈ డబ్బు దేవుడు ఇచ్చాడని సంతోషపడ్డాడు.



# పగ తీర్చుకున్న ఆత్మ

మినీ నవల

"రామచంద్రాపురం వచ్చింది. దిగ వలసిన వారు వుంటే దిగండి" అని కండక్టర్ పెద్దగా అరవడంతో నిద్రలో వున్న చక్రపాణి ఉలిక్కిపడిలేచి "రామచంద్రాపురం వచ్చేసిందా" అని అనుకుంటూ టైం చూసుకున్నాడు. రాత్రి రెండు గంటలవుతుంది. మెల్లగా పైకి లేచి, "కండక్టర్ నేను దిగాలి" అంటూ తన సూట్‌కేస్, మేకప్ వస్తువులు ఉన్న మరో పెట్టె తీసుకుని నెమ్మదిగా కండక్టర్ వద్దకు వచ్చి, "కండక్టర్! నేను, ఇక్కడ నుండి వూరుకు వెళ్ళడానికి ఎంతసేపు పడుతుంది" అడిగాడు.

"ఆ సంగతి నాకు ఎలా తెలుసు. ఈ ఎడమ వైపుగా వెళితే వూరుకు దారి కనిపిస్తుంది. ముందు బస్ నుండి దిగు. మాకు ఆలశ్యం అవుతుంది" విసుగుతో కండక్టర్.

బి.వి. భానుప్రియ



చక్రపాణి క్రిందికి దిగి "ఈ అర్ధరాత్రి వేళ నాకు వూరుకు దారి చెప్పడానికి ఎవరూ వుండరు. పైగా అంతా చీకటిగా వుంది. ఇదే పట్నం అయితే వీధిలైట్లు వుండేవి. ఎవరో ఒకరు తిరుగుతూ వుంటారు. ఇక్కడ కనుచూపు మేర దూరంలో ఎవ్వరూ కనిపించలేదు. పైగా ఏవో విచిత్ర శబ్దాలు వినిపిస్తున్నాయి. ఏం అయినా నేను రామచంద్రాపురం వెళ్ళాల్సిందే" అనుకుని మెల్లగా నడవసాగాడు.

"బాబూ కొంచెం ఆగు" అన్న మాటలు విని పించడంతో చక్రపాణి ఉలిక్కిపడి నెమ్మదిగా వెనక్కి తిరిగిచూసాడు. ఎవ్వరూ కనిపించలేదు. తన భ్రమ అయివుంటుందని మనసులో అనుకుని నడక ప్రారంభించాడు.

"బాబూ! ఆగమంటే ఆగకుండా ముందుకు వెళుతున్నావే. నేను నీతో మాట్లాడాలి. కాస్త ఆగు" అన్న మాటలు తిరిగి వినిపించడంతో చక్రపాణి భయంతో వెనక్కి తిరిగి చూసి "ఎవరు?" అని అరిచాడు.

ఆ సమయంలో చక్రపాణి నోటమాట రావడం అతి కష్టమనిపించింది. చల్లని గాలి వీస్తున్నా అతని శరీరం చెమటతో తడిసి ముద్దయింది.

"భయపడకు. నేను ఎవ్వరికి కనబడను. కానీ నా మాటలు మాత్రం అందరికి వినబడుతుంది. నీతో మాట్లాడాలి. నువ్వు ధైర్యంగా వుండు" అన్న మాటలు వినిపించాయి.

"అయితే... ను... నువ్వు... ద... ద... దయ్యానివా. నాతో నీకు ఏం పని వుంటుంది. దయచేసి నన్ను వదిలేయి. నేను ఈ గ్రామానికి కొత్త" భయంతో అన్నాడు చక్రపాణి.

"నేను దయ్యాన్ని కాను. కాకపోతే కోరిక తీరని ఆత్మని. నేను అన్యాయంగా చంపబడ్డాను. నా కథ వివరంగా చెబుతాను నాకు జరిగిన అన్యాయానికి నువ్వే న్యాయం చేయాలి" అన్నది ఆత్మ.

"చూడండి. ఆత్మగారూ! మీరు ఎవరికీ అపకారం చేయని మంచి ఆత్మగా వుండవచ్చు. కానీ నాకు మీ కథ వినడానికి సమయం లేదు" భయంతో చక్రపాణి.

"నువ్వు నన్ను చూసి భయపడుతున్నావో లేక ఎగతాళి చేస్తున్నావో నాకు అర్థం కాలేదు. కానీ నా వల్ల నీకు ఏ అపకారం జరగదు. ఇది అర్ధరాత్రి సమయం. ఇపుడు వెళ్ళినా నువ్వు ఎవ్వరిని కలవ లేవు. ఇంతకీ నీ పేరు ఏమి?" అడిగింది ఆత్మ.

"నా పేరు చక్రపాణి" అన్నాడు.

"చక్రపాణీ! ముందు నా కథ విను. ఆ తరువాత నీకు ఇష్టమైతే నాకు సహాయం చేయి. నా పేరు రంగారావు. ఈ గ్రామంలో వంద ఎకరాల భూమికి

అధిపతిని. నా వయసు ఎంతో తెలుసా. అరవై సంవత్సరాలు. నేను బ్రహ్మచారిని. భార్యా పిల్లలు వుంటే ఎక్కడ లేని కష్టాలు వస్తాయని నేను వివాహం చేసుకోలేదు. ఆ తరువాత ఆలశ్యంగా తెలుసు కున్నాను. నేను వివాహం చేసుకోకుండా పెద్ద పొర పాటు చేసానని. నా ఆస్తిపై చాలామంది కన్ను వేసారు. కానీ నా ఆస్థి అంతా ఈ గ్రామంలో వున్న అన్ని ఆలయాలకి కానుకగా ఇవ్వాలనుకున్నాను. నా పిల్లలు వుంటే ఈ వయసైన కాలంలో నాకు సహా యంగా వుండేవారని చాలా రోజులు బాధపడ్డాను.

నేను బ్రహ్మచారిగా వున్నందువలన అరవై ఏళ్ళు నిండినా నాకు ఏ ఆరోగ్య సమస్యా రాలేదు. కొందరు వైద్యులు నన్ను పరీక్షించి వందేళ్ళు జీవిస్తావని చెప్పారు.

గ్రామస్థులు అందరూ ఎంతో అప్యాయంగా మాట్లాడినా, నా వాళ్ళు నా కొరకు వుండాలను కున్నాను. అపుడే పొరపాటు చేసాను. ప్రక్క గ్రామంలో వుంటున్న మా అక్క చనిపోవడంతో, అక్కడికి వెళ్ళాను. ఆమె పిల్లలు నారాయణ, నరసింహా మంచి యుక్త వయసులో వున్నారు. అటువంటి వాళ్ళు నాకు తోడుగా వుంటే మంచిదని తిరిగి వచ్చేటపుడు నాతోపాటు వారిని రామ చంద్రాపురం తీసుకు వచ్చాను.

మా ఇంటికి వచ్చిన తరువాత నాకు తెలిసింది. ఆ ఇద్దరూ సోమరిపోతులని. ఏ పని చేయటానికి చేతరాదని. ఆఖరికి పొలం పనులు చేయమని పొలం వద్దకు పంపితే, అక్కడ పనిచేస్తున్న వారితో గొడవ పెట్టుకుని తిరిగి వచ్చారు. అయినా నేను వారిని తిట్టక ఇంట్లోనే వుండనిచ్చాను.



ఒకరోజు ఇద్దరూ నా వద్దకు వచ్చి, "మామయ్యా! నీ తరువాత నీ ఆస్తి అంతా ఆలయాలకు రాసిస్తున్నా వని మన మునుసుబు గారు చెప్పారు. నిజమా?" అడిగారు.

"అవును నిజమే. నాకు వారసులు ఎవరూ లేరు. ఆస్తిని మంచి కార్యానికి ఉపయోగిస్తే పుణ్యం కదా" అన్నాను.

"నీకు వారసులు లేకపోతే ఏమి. నీ అక్క బిడ్డలం వున్నాం కదా. మాకు ఎవరు వున్నారు. ఏదో నీ దయవలన ఇపుడు బాగున్నాం. నీ తరువాత ఇలా వుండాలనుకుంటున్నాం. మమ్మల్ని మరచిపోకు" అన్నారు. అందులకు నేను నవ్వుతూ, "మిమ్మల్ని ఎందుకు మరచిపోతాను. మీరు నా ఇంటికి రాక ముందు ఆస్తి అంతా ఆలయాలకు ఇవ్వాలను కున్నాను. కానీ మీరు నా చివరి దశలో నాకు



సహాయంగా వున్నందువలన మీకు ఓ వాటా ఇస్తాను. అంతే గాని మొత్తం మీకు వ్రాసి ఇవ్వను. మీరు అంతా పాడుచేస్తారు" అన్నాను.

"మామయ్యా! మేం మంచిగా వుంటాం. మా మంచితనం చూసి నీ ఆస్తిని వ్రాసి ఇవ్వు" అన్నారు.

"అది వీలుకాదు. నాకు అవసరమైన పని వుంది. మీతో తరువాత మాట్లాడుతాను" అంటూ నేను వేగంగా వెళ్ళిపోయాను. ఆ ఇద్దరు నా ఆస్తి కొరకు నా ఇంట్లో ప్రవేశించారన్న సంగతి అపుడు నేను గ్రహించలేకపోయాను.

మరునాడు రాత్రి నిద్రలో వున్న నాకు మెలకువ అవడంతో లేచాను. ప్రక్క గదిలో ఇద్దరూ పెద్దగా మాట్లాడుతుండగా, నెమ్మదిగా లేచి వినసాగాను.

"నారాయణా! నాకు ఈ ఆస్తి వస్తుందన్న నమ్మకం లేదు. మనం అనాథులైతే ఈ మామయ్య తనతో పిలుచుకు వెళ్ళి ఆస్తి ఇస్తాడన్న ఆశతో మన తల్లిని చంపి, గుండెపోటుతో మరణించారని అందరికి చెప్పాం. తీరా ఇక్కడికి వచ్చిన తరువాత తెలిసింది. ఈ ఆస్తి ఆలయాలకు వెళుతుందని. ఇపుడు ఏం చేద్దాం" అన్నాడు నరసింహ.

"అందుకే ఇపుడు నేను మామయ్య సంతకం చేయడానికి ప్రయత్నిస్తున్నాను. ఇపుడు చాలా బాగా సంతకం చేస్తున్నాను. మనమే పత్రంలో ఈ ఆస్తి మామయ్య మనకి వ్రాసి ఇచ్చినట్లు వ్రాసి, ఆయనలా సంతకం చేసి, ఆ తరువాత ఆయన్ని చంపేస్తే ఈ ఆస్తి మన సొంతం అవుతుంది. ఎవ్వరూ మనల్ని అనుమానించరు" అన్నాడు నారాయణ.

అది వింటున్న నాకు వారి పీక పిసికేటంత కోపం వచ్చింది. అపుడు తొందరపడకూడదని మనసులో అనుకుని చప్పుడు చేయకుండా వచ్చి పడుకున్నాను. కాని నిద్రరాలేదు. ఆ ఇద్దరు మాటలే పదే పదే వినిపిస్తున్నాయి. అయినా కష్టపడి నిద్ర పోవడానికి ప్రయత్నించాను. కానీ రాలేదు. పెళ్ళి చేసుకుంటే, బిడ్డలు పుట్టి వారి వలన అనేక కష్టాలు పడవలసి వస్తుందని ఇన్ని సంవత్సరాలు, బ్రహ్మచారిగా వుంటూ ఆఖరికి ఈ రాబందులను నా ఇంటిలో తెచ్చి పెట్టుకుని కష్టాలు తెచ్చుకున్నాను. ఇక వారిని ఇంటిలో వుండనీయకుండా వెంటనే ఆ ఇద్దరినీ పంపేయాలని నిర్ణయించుకున్నాను.

మరునాడు నిద్ర నుండి లేవగానే ఇద్దరిని పిలిచి, "మీ ఇద్దరూ మీ వూరుకు వెళ్ళిపోండి. నేను పిలిచినపుడు నా వద్దకు రండి" అన్నాడు.

"ఏమైంది? మేము ఏం పొరపాటు చేసాం. నీతో మంచిగా వుంటున్నాం కదా" అన్నారు ఇద్దరు.

నేను కోపంతో, "ఏం కారణం చెబితే గాని బయటికి వెళ్ళరా. మీరు మంచిగా వున్నారో, చెడ్డగా వున్నారో మీ మనసును అడిగి తెలుసుకోండి. ఇది నా ఇల్లు. నా ఇష్టం లేని వారిని ఇంటి నుండి బయటికి తరమే హక్కు నాకు వుంది. మర్యాదగా వెళ్ళండి" అన్నాను.

"సరే అంత కోపం ఎందుకు పడతావు. నీ ఇష్టం లేక ఈ ఇంట్లో ఎలా వుండగలం. ఈ సాయంత్రం బస్సులో వెళ్ళిపోతాం. మా సామానులు సర్దు కుంటాం" అంటూ గదిలోకి వెళ్ళారు.

నేను కోపంగా పొలం వద్దకు వెళ్ళాను. సాయంత్రం వరకు అక్కడే వుండి ఆ తరువాత ఇంటికి బయలుదేరాను. చలికాలం అయినందు వలన చీకటి పడసాగింది.

దిగుడు బావి వద్దకు వచ్చేసరికి ఎవరో నా వెనుక వస్తున్నారని అనుమానంతో వెనక్కి తిరిగాను. నారాయణ, నరసింహ, దుడ్డు కర్రలతో నిలబడి వున్నారు. చుట్టు ప్రక్కలా నాకు సహాయం చేయడానికి ఎవరూ లేరు.

"ఏం నన్ను చంపబోతారా" అని నేను అడుగు చుండేంతలో ఇద్దరూ దుడ్డు కర్రలతో నా తలపై బలంగా మోదసాగారు. కొన్ని క్షణాలకంతా నా తల పగిలి ప్రాణాలుపోయింది. నా శరీరానికి మరణం సంభవించినా ఆత్మకు ఏం కాలేద. అన్యాయంగా చంపబడినందువలన, నన్ను చంపిన వారిపై పగతో ఆత్మ అక్కడే వుండిపోయింది. పగ తీరేవరకు అది పైకి వెళ్ళదు. ఆ సంగతి తెలుసుకోవాలని ఆ ఇద్దరూ నా శవాన్ని దిగుడు బావిలో విసిరి వెళ్ళిపోయారు. ఆ బావిలో అసలు నీరు వుండదు. గ్రామంలో చాలా



మంది అందులో పడి ఆత్మ హత్యలు చేసుకుంటూ వుంటారు. అందువలన ఆ చుట్టూ ప్రక్కలా జనం అసలు తిరగరు. ఆ గ్రామస్థులకు నా శవం బావిలో వున్న సంగతి ఎప్పటికీ తెలియదు.

ఆ ఇద్దరిపై పగతో ఆత్మరూపంలో తిరుగు తున్నాను. నాకు శక్తి ఎంత వున్ననూ శరీరం లేనిదే ఏమీ చేయలేను. అందుకే తగిన శరీరం కొరకు ఎదురు చూస్తుండగా నువ్వు కనిపించారు. ఇపుడు చెప్పు నా గురించి అంతా విన్నావు కదా నాకు సహాయం చేస్తావా" అడిగింది ఆత్మ.

అప్పటికే చక్రపాణికి భయం అంతా పోయింది. అంతకు ముందు ఆత్మ అంటే భయంతో వున్న చక్రపాణికి ఆప్యాయత పుట్టుకు వచ్చింది.

"రంగారావుగారు, మీరు ఎప్పుడో చంపడ్డారు. ఎన్ని రోజులుగా ఇలా తిరుగుతున్నారు. నేను మీకు

ఏ విధంగా సహాయం చేయగలను" అడిగాడు చక్రపాణి.

"నేను నిన్న సాయంత్రం చంపబడ్డాను. ఇంకా గ్రామస్థులకు నేను చనిపోయిన సంగతి తెలియలేదు. నువ్వు నాకు సహాయం చేయగలవని నేను ఎందుకు అనుకున్నానంటే, నువ్వు చూడ్డానికి అచ్చు నాలా వున్నావు. కాకపోతే నాకు వయసు అయినందువలన, శరీరంలో ముడతలు, తెల్లజుట్టు వుంది. నువ్వు మంచి వయసులో నాలా వున్నావు. ఇపుడు నీ తల వెంట్రుకలు తెల్లగా వుండి దట్టమైన మీసాలు నుదుటన, చందనబొట్టు, పట్టు చొక్కా, పట్టు పంచ, చేతిలో ఊతకర్ర వుంటే, గ్రామంలో ఎవరు చూసిన నిన్ను రంగారావు అంటారు" అన్నది ఆత్మ.

"అలాగా... అయితే ముందు మీ ఫోటో చూస్తే నా రూపం దానికి తగినట్లుగా మార్చుకోగలను" అన్నాడు చక్రపాణి. "అయితే ముందు నా ఇంటికి వెళ్ళు. ఆ ఇద్దరు వెదవలు పొలంలో వున్నారు. తెల్లారికి గాని ఇంటికి రారు. నా ఇంట్లో నా ఫోటో వుంది. వెళ్ళి చూడు. అవును... ఇంతకీ నువ్వు ఎవరు? ఎవరికోసం ఈ గ్రామానికి వచ్చావు" అడిగింది ఆత్మ.

"నేను నాటకాలకు విగ్‌లు ఇస్తుంటాను. మేకప్ చేస్తుంటాను. మీ గ్రామంలో ఏదో నాటకంలోని నటీ నటులకు మేకప్ చేయడానికి గ్రామ మునుసుబు నన్ను పట్నం నుండి పిలిపించాడు. మధ్యలో మీరు కలిసారు" అన్నాడు చక్రపాణి.

"అయితే మరీ మంచిది. నీకు నా రూపం మార్చుకోడానికి ఏ కష్టం రాదు. నువ్వు మునుసు గారి వద్దకు వెళ్ళకు. ముందు నా ఇంటికి వెళ్ళు. నేను దారి చెబుతాను. ముందుకు నడువ్" అన్నది ఆత్మ.

చక్రపాణి ఆత్మ చెప్పినట్లుగా ముందుకు వెళ్ళి పెద్ద ఇల్లును చేరుకున్నాడు. ఆత్మ చెప్పినట్లు గూటిలో వున్న తాళాలు తీసుకుని ఇంటి తలుపులు తెరచుకొని



లోపలికి నడిచాడు. ఇంట్లో ఎదురుగా రంగారావు నిలువెత్తు ఫోటో వుంది. దాన్ని చూడడంతో చక్రపాణి "ఈ రంగారావు అచ్చు నాలా వున్నాడు" అని మనసులో అనుకున్నాడు.

ఆ తరువాత చక్రపాణి తన మేకప్ పెట్టే తెరచి తన తలకు తెల్లజుట్టు, విగ్గు, మీసాలు ముఖంపై ముడతలు చేసుకున్నాడు. లోపల బీరువా తెరచి, పట్టుబట్టలు తీసి ధరించాడు. ముఖానికి చందన బొట్టు పెట్టుకుని, మూలలో వున్న ఊతకర్ర తీసుకుని, ఎదురుగా వున్న అద్దంలో తన ప్రతిబింబాన్ని చూసి, "అచ్చు ఆ ఫోటోల వున్న రంగారావులా వున్నాడు. ఎవ్వరికి అనుమానంరాదు" అనుకున్నాడు.

దగ్గరలో వున్న ఆత్మ, "చక్రపాణి. నేను నీ దగ్గరలోనే వుంటాను. నీకు ఏ అపాయం వచ్చినా ఆదుకుంటాను. నువ్వు మాత్రం ధైర్యంగా నాలా నటించు" అన్నది.

తెల్లారింది. నారాయణ, నరసింహా పొలం నుండి ఇంటికి వచ్చారు. ఇంటి తలుపులు బార్లా తెరచి వుండటంతో ఆశ్చర్యపోయి, "మన ఇల్లు తెరిచి వుందంటే ఎవరో లోపలికి వెళ్ళినట్లున్నారు. కొంపతీసి దొంగలు ఇంట్లో దూరారా" అని అనుకుంటూ లోపలికి వచ్చారు.

ఇంట్లో కుర్చీలో రంగారావు వేషంలో వున్న చక్రపాణి దినపత్రిక చదువుతూ వున్నాడు. అంతే ఇద్దరూ అదిరిపడ్డారు. ముందు రోజు సాయంత్రం తమ చేతులతో రంగారావుని చంపి శవాన్ని దిగుడు బావిలో విసిరి, రాత్రంతా పొలంలో ఆనందంగా గడిపి, ఇంటికి రాగానే రంగారావు కనబడడంతో ఇద్దరు భయంతో "ద... ద.. దయ్యం" అని అరిచారు.

రంగరావు కోపంగా వారివైపు చూసి, "దయ్యమా ఎక్కడుంది? మీరిద్దరు దయ్యాలు. నిన్ననే వూరు వదిలి వెళ్ళమని చెప్పానుకదా! ఇంకా ఎందుకు





వున్నారు?" అడిగాడు. "నువ్వు మనిషివి కావు. మాకు బాగా తెలుసు. ఎవరు నువ్వు? మామయ్యలా ఎందుకు వేషం వేసుకున్నావు. మమయ్య ఈ ఊరులో అసలు లేడు. మాకు బాగా తెలుసు" అన్నారు.

"పిచ్చి దద్దమ్మల్లారా. ఇన్ని రోజులు నా ఇంట్లో తిండి తిని ఇపుడు నేను మీ మామయ్య కాదంటారా. ముందు నా ఇల్లు నుండి పొండి" అని గట్టిగా రంగారావు అరిచారు.

ఆ అరుపులకు పక్కింట్లో వున్న పూజారి పరిగెత్తుకువచ్చి, "ఏం జరిగింది? ఎందుకు పోట్లాడు కుంటున్నారు" అడిగాడు.

నారాయణ ఆయన వద్దకు వెళ్ళి, "మా మామయ్య నిన్న సాయంత్రం పట్నం వెళ్ళాడు. వారం రోజులు దాకా ఇంటికి రానని చెప్పారు. కాని ఈ వ్యక్తి ఎవడో మామయ్య అంటున్నాడు. ముందు వాడిని ఇంటి నుండి తరమండి" అన్నాడు.

పూజారి రంగారావువైపు చూసి, తరువాత నారాయణ "నిజంగా నీకు పిచ్చినట్లుంది. ఎదురుగా వున్న మీ మామయ్యని చూసి ఎవరో నకిలీవాడు అంటున్నావు" అన్నారు.

"పూజారీ గారూ! ఈ ఇద్దరు నా ఆస్తి దోచేయా లని పథకం వేస్తున్నందువలన, నిన్న తెల్లారి వారిని మా ఇంటి నుండి వెళ్ళిపొమ్మని గట్టిగా చెప్పాను. కాని ఇద్దరు రాత్రంతా పొలాలలో తిరిగి ఇపుడు నన్ను బయటకి పొమ్మంటున్నారు. వీళ్ళతో మంచిగా మాట్లాడితే ప్రయోజనం లేదు" అంటూ తన కర్రతో నాలుగు తన్ని ఇద్దర్ని బయటికి తరిమాడు. పూజారి వెళ్ళిపోయాడు. అంతలో ప్రక్కనే వున్న ఆత్మ, "చక్రపాణి! నేను చేయాలనుకున్నది నువ్వు క్షణంలో

చేసావు. నాకు సంతోషంగా వుంది. ఇక ఆ వెధవలని ఇంట్లోకి రానీయకు. ఆ తరువాత ఈ గ్రామంలో చాలా మంది నా వద్ద అప్పులు తీసుకున్నారు. వాళ్ళంతా తిరిగి ఇస్తే ఏమీ మాట్లాడకుండా తీసుకో. నేను అలా తిరిగి వస్తా" అంటూ వెళ్ళిపోయింది.

చక్రపాణి ఆ గ్రామమంతా తిరిగి రావాలని ఇంటికి తాళం వేసి బయలుదేరాడు. దారిలోఒక వ్యక్తి కనబడి, "నమస్కారం రంగారావుగారు బాగున్నారా?" అని అడిగాడు. ఆ వ్యక్తి ఎవరో చక్రపాణికి తెలియదు. పైకి నవ్వుతూ "ఆ బాగున్నాను" అని ఆగాడు.

సరిగ్గా ఆ సమయానికి సైకిల్‌పై వెళుతున్న వ్యక్తి చక్రపాణి ఎదురుగా వున్న వ్యక్తితో, "నమస్కారం మునుసబుగారు" అంటూ వెళ్ళాడు.

అప్పుడు చక్రపాణికి ఆ వ్యక్తి గ్రామ మునుసబు అయి వుంటాడని తెలుసుకున్నాడు.

అంతలో మునుసబు, "రంగారావుగారు నిన్న నారాయణ, నరసింహ నా వద్దకు వచ్చి, మీరు పట్నం వెళ్ళారూ, అక్కడే వుండిపోతారని ఈ ఆస్తి అంతా వారికి మీరు వ్రాసి ఇచ్చినట్లు చెప్పారు నిజమా" అడిగాడు.

"మునుసబుగారూ! ఆ ఇద్దరు దొంగ వెధవలు. వారి మాటలు ఎప్పటికీ నమ్మకండి. నా ఆస్థి అంతా ముందు నేననుకున్నట్లు మన గ్రామంలో వున్న అన్ని ఆలయాలకు చెందుతుంది. ఆ ఇద్దర్ని ఈ రోజు ఇంటి నుండి తరిమేసాను" అన్నాడు రంగారావు.

"అమ్మో! ఎంతటి దుర్మార్గులు. అనాధులని మీ ఇంటికి తీసుకు వస్తే మీకే ఎసరుపడతారే. అయినా మీరు జాగ్రత్తగా ఉండండి. ఈ డబ్బు పాపిష్టిది.



వాళ్ళు ఆస్తికోసం మీకు ఏమైనా హాని తలపెట్టగలరు" అంటూ మునుసబు వెళ్ళిపోయారు. నారాయణ, నరసింహ, తమ వూరుకు వెళ్ళకుండా ఆ వూరి పొలిమేరల్లో వుండి తాము చంపిన రంగారావు ఎలా తిరిగి వచ్చాడు ఆలోచించ సాగారు.

"మనం కొట్టిన దెబ్బలకు ఆ ముసలోడి తల పగిలి రక్తం కారడం కళ్ళార చూసాం. అయినా ఎలా బ్రతికి బయటపడ్డాడు. తలపై అసలు గాయలు కనిపించలేదు. ఒకవేళ దయ్యమా?" అన్నాడు నరసింహ.

"దయ్యంలేదు. గియ్యంలేదు. మామయ్య చనిపోయాడు. ఆ సంగతి నాకు బాగా తెలుసు. అక్కడ వున్నవాడు ఎవడో మోసగాడు. మామయ్య ఆస్థికోసం ఈ నాటకం ఆడుతున్నాడులా వుంది" అన్నాడు నారాయణ.

"అవును నువ్వన్నది సరి. నిన్న మామయ్యని చంపి ఆ దిగుడు బావిలో విసిరేసాం కదా! ఇపుడు మనం బావిలో దిగి చూద్దాం. అక్కడ మామయ్య శవం పడి వుంటే అక్కడ వున్నవాడు నకిలీ అని తెలిపోతుంది. రా త్వరగా వెళ్ళి చూద్దాం" అంటూ నరసింహ ముందుకు నడిచాడు.

అక్కడనే తిరుగుతున్న రంగారావు ఆత్మ, "మీ ఆట కట్టిస్తాను" అంటూ వేగంగా ఆ దిగుడు బావిలో దూరింది. ఇద్దరూ ధైర్యం తెచ్చుకుని నెమ్మదిగా దిగుడు బావిలోకి దిగసాగారు.

అంతలో బావి అడుగు నుండి "ఎవరు నా బావిలోకి దిగుతున్నారు. ప్రాణాలపై మీకు ఆశలేదా. ఇప్పటికే పది మంది ఇక్కడ ఆత్మహత్య చేసుకుని దయ్యాలుగా వున్నారు. ఇక మీకు ఇక్కడ స్థలం లేదు. వెళ్ళండి" అన్న మాటలు వినిపించాయి.

ఇద్దరూ భయంతో ఆగారు. ఆ తరువాత తమాయించుకుని "అంతా మన భ్రమ. ఇక్కడ దయ్యాలు లేవు. గియ్యాలు లేవు" అని అనుకుంటూ క్రిందికి దిగసాగారు.



"ఏయ్ దున్నపోతుల్లారా. నేను పెద్ద దయ్యాన్ని. క్షణంలో మీ రక్తానంతటిని తాగేస్తాను. ఇంకో అడుగు ముందుకు వేసారంటే అంతే" అంటూ పెద్దగా అరుపులు వినిపించడంతో, ఇద్దరూ భయంతో వెనక్కి వెళ్ళిపోయారు. ఆ తరువాత ఇద్దరూ పాడుపడిన మండపంలో తల దాచుకున్నారు.

అపుడు నారాయణ, "నాకు ఆలోచన వచ్చింది. ఈ రోజు ఒకటో తారీకు కదా. మామయ్య వద్ద అప్పులు తీసుకున్నవారు వడ్డీతో పాటు అసలు అంతా మామయ్యకు ఇస్తారు. అక్కడ వున్న వ్యక్తి నకిలీ అయితే వచ్చినవాడి పేరు తెలియదు. ఎలా వాడి పత్రాలు తిరిగి ఇస్తాడు. అంతేకాదు మామయ్య పత్రాలు దాచిన బీరువా తాళాలు ఎక్కడ వుందో మనకే తెలియదు" అన్నాడు.

"అవును నిజం. అయితే మనం గ్రామ మునుసబు కరణం గారికి వెంటబెట్టుకొని మామయ్య ఇంటికి వెళ్ళి వాడు నకిలీ అని నిరూపిస్తాం" అని నరసింహ నడవడంతో, అంతటిని వింటున్న ఆత్మ నవ్వుతూ వారికన్నా ముందుగా ఇల్లుచేరి చక్రపాణికి అంతా చెప్పి అతని శరీరంలో దూరింది.

నరసింహం నారాయణ గ్రామంలోకి వస్తుండగా ఎదురుగా గ్రామ మునుసబు కరణం కనిపించడంతో వారిని ఆపి, "ముందు మా మాటలు వినండి. మామయ్య రూపంలో ఎవడో మోసగాడు వున్నాడు. ఇప్పుడు మాతో రండీ" అని వారికి నచ్చజెప్పి రంగారావు ఇంటికి వచ్చారు.

ఇంట్లో నుండి బయటికి రాబోతున్న రంగారావు తన ఇంటికి వస్తున్న మేనళ్లును చూసి, "ఎందుకు నా ఇంటికి వచ్చావు" అని కోపంగా అరిచాడు.

అంతలో మునుసబు "రంగారావు! వాళ్ళు ఏదో చెప్పాలనుకుంటున్నారు. అది వినాలని వచ్చాం. కొంచెం కోపం తగ్గించి వాళ్ళని లోపలికి రానీయండి" అనడంతో రంగరావు శాంతించాడు. సరిగ్గా ఆ సమయానికి ఇద్దరు రైతులు వచ్చి, "రంగారావుగారూ





మీ వద్ద తీసుకున్న యాభై వేలు వడ్డీతో సహా ఇస్తున్నాను" అంటూ డబ్బు ఇచ్చి "మా పత్రాలు ఇస్తే మేము వెళతాం" అన్నారు.

అపుడు నారాయణ మునుసబుతో మెల్లగా, "ఇపుడు దొంగ దొరికిపోతాడు. ఆ రైతు పేరుతో వున్న పత్రాలు ఎలా ఇస్తాడో చూడండి" అన్నాడు.

రంగారావు నవ్వుకుంటూ పూజగదిలోకి వెళ్ళి అక్కడ దాచిన తాళాలు తీసుకువచ్చి, బీరువా తెరచి, అందులో పత్రాలు వున్న కట్ట తీసుకువచ్చి, అందులో ఒక పత్రాన్ని తీసి రైతు వద్దకు ఇచ్చి, "చంద్రయ్యా! ఇదిగో నీ పత్రం" అంటూ ఇచ్చాడు.

రైతులిద్దరూ వెళ్ళిపోయిన తరువాత రంగారావు, "మునుసబుగారూ! కరణం గారూ! ఆ ఇద్దరు పనికిరాని వెధవలని ముందే చెప్పాను. వారి మాట విని పనిగట్టుకుని నా వద్దకు వచ్చారు. అసలు మీకు నాపై ఎందుకు అనుమానం వచ్చిందో నాకు తెలియలేదు" అన్నాడు.

"క్షమించండి రంగారావు! ఆ వెధవల మాట విని మీ వద్దకు వచ్చినందులకు మాకే సిగ్గుగా వుంది. ఇక ఎప్పటికి వారి మాటలు వినము. ముందు ఈ ఇద్దరిని బాగా తిట్టి వస్తాం" అంటుండగా నారాయణ, నరసింహ అక్కడ నుండి పరిగెత్తి వెళ్ళిపోయారు.

ఆ తరువాత మునుసబు, కరణం వెళ్ళిన తరువాత చక్రపాణిలో వున్న రంగారావు ఆత్మ బయటకి వచ్చేసింది. మరునాడు రంగారావు పొలం వద్దకు వెళ్ళి తిరిగి వస్తుండగా వర్షం పడింది. వర్షంలో తడుచుకుంటూ వేగంగా నడవసాగాడు. అపుడు అతని ముఖంపై వున్న మేకప్ అంతా చెడిపోయింది. తలలో విగ్ జారసాగింది. అయినా అటువైపు ఎవరూ రానందువలన అతను వేగంగా ముందుకు వెళుతుండగా వున్నట్టుండి చెట్టు వెనుక నుండి నారాయణ, నరసింహ వచ్చి, "ఏయ్, ఎవరు నువ్వు? మర్యాదగా నిజం చెప్పు. నీ ముఖంలో ముడతలు కనిపించడం లేదు. నువ్వు మామయ్య కాదు" అన్నారు.

"మీలాంటి పనికిరాని వెధవలకు నేను ఏమి చెప్పాల్సిన అవసరం లేదు. మర్యాదగా నాకు అడ్డు తొలగండి" అంటూ రంగరావు తల విగ్ సరిచేసుకున్నాడు.

దాంతో వాళ్ళు కోపంతో, "నీతో మంచిగా మాట్లాడితే ప్రయోజనం లేదు. నా అంతు చూస్తాం" అంటతూ ఒక్కసారిగా రంగారావుని బలంగా కొట్ట సాగారు. రంగారావు అదుపు తప్పి క్రిందపడడంతో, తలవిగ్ కొంత ప్రక్కకి జరగడంతో నారాయణ దాన్ని బయటకి లాగి, "ఇపుడు బాగా తెలిసింది. నువ్వు

మామయ్యవి కావు. నిజం చెప్పు ఎవరు నువ్వు" అడిగారు. కాని చక్రపాణి వారికి ఏం చెప్పలేదు. ఆ దగ్గరలో ఆత్మ లేనట్టుందని మనసులో బాదపడ్డాడు. అంతలో నారాయణ చక్రపాణి మీసాలు లాగి, దగ్గరలో వున్న చెట్టుకు గట్టివేసాడు.

"నరసింహా! ఇక ఈ మోసగాడు సంగతి తెలిసిపోయింది. నేను కరణం గారిని, నువ్వు మునుసబు గారిని ఇక్కడికి తీసుకువస్తే వీడి పీడ విరగడ అవుతుంది. త్వరగారా" అనడంతో నారాయణ వేగంగా పరిగెత్తాడు.

చక్రపాణి తప్పించుకోవాలని విశ్వ ప్రయత్నాలు చేసాడు. కాని గట్టిగా త్రాడు కట్టడం వలన వీలు కాలేదు. "ఇక ఆలశ్యమైతే గ్రామ పెద్దలు వస్తే అసలు సంగతి తెలిసిపోతే ప్రమాదం అని బాదపడుతుండగా అతని చెవి దగ్గర "చక్రపాణీ! భయపడకు నేను వచ్చేసాను. నీ శరీరం ప్రవేశించానంటే నీకు వెయ్యి ఏనుగుల బలం వస్తుంది" అంటూ చక్రపాణి శరీరంలోకి రంగారావు ఆత్మ ప్రవేశించింది. అంతే మరుక్షణం చక్రపాణి ముఖం ఎర్రగా మారిపోయింది. పెద్దగా అరిచి తనకు కట్టిన త్రాడును ఒక్కసారిగా తెంపాడు.

ఆ తరువాత క్రిందపడిన విగ్గులుని తీసుకుని వేసుకున్నాడు. ఆ తరువాత రంగారావు ఆత్మ బయటకి వచ్చి, "ముందు నువ్వు ఇంటికి వెళ్ళు. సరిగ్గా మేకప్ వేసుకుని పంచాయితి ఆఫీసు వద్దకు రా. ఇంతలో నేను ఆ ఇద్దరిని కొంత ఆట పట్టిస్తాను" అని వెళ్ళిపోవడంతో, చక్రపాణి వేగంగా ఇంటివైపు నడిచాడు.

ఇద్దరూ భయంతో వెనక్కి తిరిగి పరిగెత్తి పొలాల గట్టు దాటుకుని కరణం, మునుసబు ఇంట్లో లేకపోవడంతో పంచాయితి ఆఫీసుకు వచ్చారు. అంతలో చక్రపాణి వేషం సరిచేసుకుని పంచాయితీ ఆఫీసుకు వెళ్ళి, కరణం, మునుసబులతో మాట్లాడసాగాడు.





పంచాయితీ ఆఫీసులోకి వచ్చిన నారాయణ, నరసింహ, అక్కడ రంగారావుని చూసి, "నువ్వా! ఇక్కడికి ఎలా వచ్చావు. నిన్ను అక్కడే చెట్టుక్కట్టి వచ్చాం కదా! ఎలా తప్పించుకుని, మాకన్నా ముందుగా ఇక్కడికి వచ్చావు" అన్నాడు.

రంగారావు కోపంతో, "మీ ఇద్దరికి పిచ్చి బాగా ముదిరినట్లుంది. లేకుంటే ఇక్కడ పెద్ద మనుషులతో మాట్లాడుతుంటే ఏమిటీ పిచ్చిమాటలు వెళ్ళండి" అని కసురుకున్నాడు. నారాయణ మునుసబు కాలిపైపడి, "అయ్యా! నా మాటలు వినండి. వీడు మోసగాడు మామయ్యలా తెల్లజుట్టు విగ్గు, మీసాలు వేసుకున్నాడు. కావాలంటే వాటిని లాగి చూడండి. వాడి అసలు రంగు తెలిసిపోతుంది" అన్నాడు.

మునుసబు కోపంతో, "మీ ఇద్దరికి బాగా పిచ్చి పట్టినట్లుంది. రంగారావు ఆస్థి కొరకు ఇలా మాట్లాడుతున్నారు. మర్యాదగా ఈ గ్రామం వదిలి వెళ్ళకపోతే పోలీసులను పిలిచి పట్టిస్తాను" అనడంతో ఇద్దరు వెళ్ళిపోయారు. ఆ తరువాత మునుసబు, "రంగారావు! ఎందుకు వీళ్ళు ఇలా విసిగిస్తున్నారో అర్థం కాలేదు. ముందు మీ ఆస్థి అంతా ఆలయం పేర వ్రాసి రిజిష్టర్ చేయించండి" అనడంతో రంగారావు తలవూపి వెళ్ళాడు. మరునాడు గ్రామంలోకి పోలీస్ జీపు రావడం చూసి గ్రామస్థులు ఆశ్చర్యపోయారు. ఎవరికొరకు వాళ్ళు వచ్చారో అర్థంగాక అందరూ జీపు వెనుక పరిగెత్తారు. పోలీస్ జీపు తిన్నగా రంగారావు ఇంటిముందు ఆగింది.

జీపులో నుండి ఇన్స్పెక్టర్‌తో పాటు నారాయణ, నరసింహ క్రింది దిగారు. అంతలో కరణం, మునసబు అక్కడికి రావడంతో ఇన్స్పెక్టర్, "మీరు ఈ గ్రామానికి కరణం, మునుసబు కదూ" అన్నారు.

"అవును. ఇంతకీ మీరు ఎందుకు వచ్చారు. ఈ ఇద్దరు మాటలు నమ్మకండి" అన్నారు.

"ఎవడో దొంగ వెధవ, రంగారావుని చంపి, ఆయన ఆస్థికొరకు ఆయనలా వేషం వేసుకొని తిరుగుతున్నాడట. ఈ సంగతి వాళ్ళు చెప్పారు. ఆ విషయం విచారిద్దామని వచ్చాను" ఇన్స్పెక్టర్.

"సార్! వాళ్ళ మాటలు నమ్మకండి. వాళ్ళు ఇప్పుడే రంగారావు ఆస్థి కాజేయాలని ఇలా పిచ్చిగా మాట్లాడుతున్నారు. రంగారావు ఈ గ్రామంలో పెద్ద మనిషి అనవసరంగా ఆయన్ని అనుమానించడం మంచిది కాదు. మీరు వెళ్ళండి" అన్నారు మునసబు.

సరిగ్గా ఆ సమయానికి ఇంట్లో నుండి బయటికి వస్తున్న రంగారావు ఇంటిబయట పోలీసులు వుండడంతో అలాగే ఆగిపోయాడు.

అంతలో "రంగారావు! మీ మేనళ్ళుల్లు మీపై అనుమానంతో పోలీసులని పిలుచుకు వచ్చారు" అన్నాడు మునుసబు.

"ఓ మీరేనా రంగారావులా నటిస్తున్న వ్యక్తి. ఆ పెద్ద మనిషిని చంపి ఎక్కడ పడేసావు" కోపంగా ఇన్స్‌పెక్టర్.

"ఇన్స్‌పెక్టర్! ఆ ఇద్దరు దొంగ వెధవలే వారిని నా ఇంటి నుండి తరిమానన్న కోపంతో ఇలాంటి పిచ్చి పనులు చేస్తున్నారు. వారి మాటలు నమ్మకండి" అన్నాడు రంగారావు.

అంతలో నారాయణ, "ఇన్స్‌పెక్టర్! వీడు మామయ్య కాదు. తలకి తెల్లరంగు విగ్ పెట్టుకున్నాడు. కావాలంటే ఆ మీసాలు లాగండి. వీడు అసలు భాగోతం తెలిసిపోతుంది" అన్నాడు. ఇన్స్‌పెక్టర్ ఏమీ మాట్లాకుండా ముందుకు వచ్చి రంగరావు జుట్టూ, మీసాలు లాగాడు. రెండు చేతికి వచ్చేసాయి. అక్కడ రంగరావు బదులు చిన్న వయసు యువకుడు కనిపించడంతో అందరూ ఆశ్చర్యపోయారు. చక్రపాణి సిగ్గుతో తలవంచుకొన్నాడు.

ఇన్స్‌పెక్టర్ కోపంతో, "దొంగ రాస్కల్. ఎవరు నువ్వు? రంగారావుని ఏం చేసావు. మర్యాదగా చెప్పు" అని అరిచాడు.

చక్రపాణి తలవంచుకుని "నన్ను క్షమించండి సార్. అంతా వివరంగా చెబుతాను చెప్పి నేను ఈ గ్రామంలో జరగబోతున్న నాటకానికి నటులకు మేకప్ వేయడానికి వచ్చాను. దారిలో రంగారావు ఆత్మ నన్ను ఆపి, చూడడానికి ఆయనలా వున్న నన్ను కొన్ని రోజులు రంగారావులా నటించమంది. అందుకే ఇలా నటిస్తున్నాను" అన్నాడు.

"శభాష్! కథ బాగా చెబుతున్నావు. ఈ కాలంలో ఆత్మలు కనిపిస్తున్నాయంటే నేను నమ్మను. నిజం చెప్పకపోతే నీ అంతు తేలుస్తాను" అన్నాడు ఇన్స్‌పెక్టర్.

"ఇన్స్‌పెక్టర్! నేను ఈ గ్రామానికి కొత్త. నేను ఎందుకు రంగారావుని చంపుతాను. ఆ ఇద్దరే



ఆయన్ని చంపి, దిగుడుబావిలో వేసారు. కావాలంటే ఆ బావిలో చూడండి" అన్నాడు చక్రపాణి.

"నువ్వు ఆయన్ని చంపి, దిగుడుబావిలో ఎందుకు వేసి వుండకూడదు. నీ మాటలు ఎందుకు నమ్మాలి. నీతో మంచిగా మాట్లాడితే ప్రయోజనం లేదు" అంటూ ఇన్స్‌పెక్టర్ లాఠీపైకి ఎత్తాడు.

మరుక్షణం ఆ లాఠీ ఎగిరి దూరంగా పడి పోవడంతో అందరూ ఆశ్చర్యపోయారు.

ఆ తరువాత ఇంట్లో వున్న రంగారావు నిలువెత్తు పటం కదులుకుంటూ బయటికి వచ్చి ఆగి, "అందరూ నేను చెప్పేది వినండి. నేను రంగారావు ఆత్మని. నన్ను అన్యాయంగా నారాయణ, నరసింహ చంపి బావిలో పడేసారు. ఆ సంగతి ఎవ్వరికి తెలియదు. ఆ ఇద్దరి సంగతి అందరికే తెలియ చేయాలని, నేను మన గ్రామానికి వస్తున్న చక్రపాణిని నాలా నటించమన్నాను. అతను మంచివాడు. అతన్ని వదలి, ఆ ఇద్దరి దొంగ వెధవలని జైలుకి తీసు కెళ్ళండి" అన్నాడు. వెంటనే ఇన్స్‌పెక్టర్, కోపంతో నారాయణ, నరసింహలను నాలుగు తన్ని జీపులో ఎక్కించి తీసుకెళ్ళాడు.

ఆ తరువాత రంగారావు ఆత్మ,

"మునసబు గారూ! నా పగతీరింది. అందువలన నేను వెళ్ళిపోతున్నాను. నా పూజగదిలో విగ్రహం వెనుక బీరువా తాళాలు దాచి వుంచాను. నా ఆస్తి అంతా నేను ముందన్నట్లు మన గ్రామంలో అన్ని ఆలయాలకు చెందుతుంది. నా కోసం కష్టపడిన చక్రపాణికి నా ఇల్లును ఇచ్చేయండి. ఇక నేను ప్రశాంతంగా వెళ్ళిపోతాను" అంటూ మాటలు ఆగిపోయాయి.

"మునసబు గారూ! నేను ఏదో పని మీద ఈ గ్రామానికి వచ్చాను. కాని రంగారావు నన్ను నిరంతరంగా ఇక్కడే వుండిపొమ్మన్నాడు చాలా సంతోషం. రంగారావు ఆత్మ పగ తీర్చుకుంది" అంటూ ఇంట్లోకి నడిచాడు.



# మకర దీవిలో మంత్రదండం









బి.ఆర్. వరదరాజులు, మద్రాసు







### జరిగిన కథ:

చందచనగుహలో ప్రతిమలు ఎవరో దొంగలించుకుపోతున్నారని ఆ గూడెం వాసులు మార్తాండుని, వజ్రదంతుని ఒక బోనులో బందించి, కాపలాగా సింహాలను పెట్టారు. మహామాయుడు, చంద్రకాంత్ మేనక చందన గుహ నుండి భయంకరమైన జంతువులు, కీటకాలుండే అడవి గుండా ప్రవేశించి సముద్రతీరం చేరారు. అక్కడ చంద్రగిరి రాజాచ తన కూతురు మేనకని తీసుకొనిపోయాడు. మహామాయుడు, చంద్రకాంత్ పడవలో మండూకదీవి బయలుదేరారు. బోనులో బందీగా వున్న మార్తాండుడు మాయా వుంగరం ద్వారా చందన గుహలోకి వెళ్ళి, ప్రతిమ ద్వారా మండూకదీవికి మార్గం తెలుసుకుని తిరిగి బోనులోకి వచ్చాడు.

## 13

ఇనుప బోనులో బందీలుగా వున్న మార్తాం డుడు, వజ్రదంతుడు, తమని బంధించిన, చందనగుహ వాసుల కొరకు ఎదురు చూడ సాగారు.

చాలాసేపు తరువాత పది మంది అక్కడికి వచ్చారు. వారిని చూడడంతో మార్తాండుడు, "మేము మీ చందన గుహలో వున్న ప్రతిమలు తీసుకు పోవడానికి రాలేదు. దారి తప్పి ఇలా వచ్చాం. ఇంకా మా మాటలపై నమ్మకం లేకపోతే మీరు వెళ్ళి గుహలో ప్రతిమలు సరిగా వుందా లేదా చూడండి" అని అనడంతో పది మంది వేగంగా గుహలోకి వెళ్ళి ప్రతిమలను లెక్కపెట్టారు. అందులో ఒకటి తగ్గింది. వారు కోపంతో బోను వద్దకు వచ్చి, "మీరు బోనులో వున్నారు కదా! మరి ఒక ప్రతిమ తగ్గిందే ఎలా?" అడిగారు.

అదే నేను చెబుతున్నాను. మాకు ముందు ఇద్దరు దొంగలు ఇక్కడికి వచ్చారు. వాళ్ళు ఎక్కడో దాగి, సమయం దొరికినపుడు ప్రతి మలు దొంగలిస్తున్నారు. మీరు అన్యాయంగా మమ్మల్ని బంధించారు. మా వల్ల మీకు ఏ నష్టం జరగదు. మమ్మల్ని వదలండి" అన్నాడు మార్తాండుడు.

వారిలో ఒక వయసైనవాడు "వాళ్ళు అన్నది నిజమే. వాళ్ళు బోనులో వుండగా, ప్రతిమ దొంగలించబడింది. అంటే దొంగలు వీరు కాదని అర్థమైంది. ప్రతిమ దొంగలు ఇక్కడే దాగి వున్నట్టుంది వీరిని వదిలేసి, వారిని

బంధించాలి" అన్నాడు. మిగిలిన వాళ్ళు సమ్మతించి, బోనులో వున్న ఇద్దరిని బయటికి పంపారు.

వజ్రదంతుడు సంతోషంతో, "మార్తాండా! నీ తెలివితో తప్పించుకున్నాం. త్వరగా వెళ్ళి, మకరదీవిలో మంత్రదండం తీసుకోవాలి" అని మెల్లగా అన్నాడు.

ఆ తరువాత ఇద్దరు వేగంగా ముందుకు నడిచి భయంకర జంతు, విషకీటకాలు వున్న అరణ్యాన్ని చేరుకున్నారు. ఆ అరణ్యం గురించి మార్తాండునికి తెలిసి వున్నందువలన, "వజ్ర దంతా! ఇది చాలా ప్రమాదకరమైన అడవి. ఇక్కడ చెట్లకు విషపూరిత పండ్లు వుంటాయి. కీటకాలు చాలా పెద్దవిగా వుంటాయి. ప్రాణం వున్న వృక్షాలు చాలా వున్నాయి. అందువలన జాగ్రత్తగా వుండు" అంటూ వేగంగా నడక సాగించాడు.

వజ్రదంతుడు అలాంటి జంతు కీటక వృక్షాలు వుంటాయా అన్న అనుమానంతో నడవసాగాడు. పెద్ద మర్రిచెట్టు వూడలతో కనిపించింది. వజ్రదంతుడు, చెట్టు సమీపంలో వెళుతుండగా, చెట్టు వూడ ఎగిరి, అతని మీదపడి, గబగబా చుట్టి, గిర్రున తిప్పసాగింది. వజ్రదంతుడు భయంతో పెద్దగా అరిచాడు.

ముందు వెళుతున్న మార్తాండుడు, వెనక్కి తిరిగి, చెట్టు వూడకు చక్రంలా తిరుగుతున్న వజ్రదంతుని చూసి పరిగెత్తుకు వచ్చి, తన వద్ద వున్న బంగారు ఇసుకను చెట్టు వైపు చూపించాడు. మరుక్షణం చెట్టు వజ్రదంతుని



క్రిందికి వదిలింది. క్రిందపడిన వజ్రదంతుని పైకి లేపి, "నేను ముందే చెప్పాను కదా! ఇది అపాయకరమైన అడవి అని. నువ్వు నాతోపాటు రావాలి. నా వద్ద బంగారు ఇసుక వున్నందు వలన అవి మనకి అపాయం చేయవు. నువ్వు నాకు దూరంగా వస్తే కష్టం. నాతోపాటు రా" అన్నాడు మార్తాండుడు.

ఇద్దరూ వేగంగా ముందుకి నడిచారు. వారి ముందు, ఏనుగును పెద్ద చీమలదండు చంప డం, సింహాన్ని చంపి, దాని మాంసాన్ని తింటూన్న పిల్లి, పెద్ద పువ్వులు కీటకాలను బంధించడం వంటి దృశ్యాలు చాలా కని పించాయి.

ముందు భయంతో వున్న వజ్రదంతుడు ఇంకా భయపడ్డాడు. బాగా అలసి పోయినా,



విశ్రాంతి తీసుకోవడానికి ఇష్టపడక, వేగంగా ముందుకు నడిచాడు.

కొంతదూరం వెళ్ళిన తరువాత, "వజ్రదంతా! ఇక్కడికి రా" అన్న గొంతు వెనుక నుండి వినిపించడంతో వజ్రదంతుడు ఆగి, "మార్తాండా! నన్ను ఎవరో పిలుస్తున్నారు. తిరిగి చూడమంటావా" అడిగాడు.

మార్తాండుడు వెనక్కి తిరిగి చూడకుండా "మూర్ఖుడా! నీకు ఎన్నిసార్లు చెప్పాలి. ఈ అరణ్యం గురించి. నిన్ను పిలుస్తున్నవి దయ్యాలు. తిరిగి చూసావంటే శిలగా మారి పోతావు. తిరిగి నీకు మామూలు రూపం రాదు. నువ్వు ఆగకుండా త్వరగా రా" అంటూ ముందుకు సాగాడు.

"వజ్రదంతా! ఆ మాంత్రికుడి మాటలు నమ్మవద్దు. నేను అందమైన దేవకన్యని. నిన్ను వివాహం చేసుకోవాలనుకుంటున్నాను. వెనక్కి తిరిగి నా అందం చూడు" అని అందమైన అమ్మాయి గొంతు వినిపించింది.

అందమైన అమ్మాయి స్వరం వినడంతో వజ్రదంతుడు సంతోషంతో, "మార్తాండా! నిజంగా ఇది దయ్యాలా? నాకు చూడాలని వుంది" అనడంతో మార్తాండుడు కోపంతో, "నీ ఖర్మ అనుభవించు. నీ చేత్తో మంచి గొప్ప కార్యం చేయించాలని, అష్ట కష్టాలుపడి తీసుకు వస్తున్నాను. నువ్వు కఠినశిలగా మారుతానంటే నేను ఏమి చేయగలను. నేను మాత్రం ఆగను. ముందు వెళతాను" అంటూ ముందుకు నడిచాడు.

"వజ్రదంతా! ఆ మాంత్రికుడు వెళ్ళి పోయాడు. ఇక ఏ మాత్రం భయపడకుండా వెనక్కి తిరిగి చూడు. నాకు నీ అందమైన ముఖం చూడాలని వుంది రా" అన్న అమ్మాయి స్వరం వినబడినా, వజ్రదంతుడు, అందులకు లొంగిపోకుండా, చెవులు మూసుకొని వేగంగా ముందుకి నడిచాడు.

కొంతసేపటికి ఆ అరణ్యం నుండి సముద్ర తీరం చేరుకున్నారు. తీరం వద్ద పడవ కనిపించింది. మార్తాండుడు అందులో ఎక్కి "వజ్రదంతా! రా. ఈ పడవ ద్వారా మనం మండూకదీవికి చేరుకోవాలి" అన్నాడు.

"మార్తాండా! ఇంత చిన్న పడవపై సముద్ర ప్రయాణం చేయడం అపాయకరం. మన ప్రాణాలు పోతుంది" అని హెచ్చరించాడు వజ్రదంతుడు.

"ఆ సంగతి నాకు తెలుసు. కానీ మనం పెద్ద పడవ కొరకు ఎక్కడ వెదకాలి. అది వీలు కాదు. వున్న ఈ పడవ మీద ప్రయాణం చేయాలి. ఇప్పటికే ఆ ఇద్దరూ మండూక దీవి చేరి వుంటారు. మనం త్వరగా వెళ్ళాలి" అని గట్టిగా అనడంతో వజ్రదంతుడు పడవలో ఎక్కాడు. ఇద్దరూ ముందుకు నడపసాగారు.

★ ★ ★ ★ ★

ముందుగా ప్రయాణం చేస్తున్న మహామాయుడు, చంద్రకాంత్ ఏ అపాయం లేకుండా సాయంత్ర సమయంలో మండూక దీవిని చేరుకున్నారు. ఆ దీవి పేరు తగినట్లు ఆ దీవిలో వేల కొలది కప్పలు కనిపించాయి.



అవి మామూలు ఆకారంలోనే వున్నాయి. అన్ని వేల కప్పలలో తమకి కావలసిన మందాకినిని కనుక్కోవడం ఎలా? అని ఆలోచించసాగారు.

అంతలో చంద్రకాంత్, "మహామాయా! మనం చాలా క్లిష్టపరిస్థితుల్లో వున్నాం. ఎఱ్ఱ కళ్ళు, నీల రంగు రాళ్ళు, బంగారు రంగు నాలికలతో వున్న మందాకినిని ఎలా కనుక్కోవడం" అన్నాడు.

"కొంచెం కష్టమైన, మనకి వేరే దారి లేనందువలన అన్ని కప్పలను జాగ్రత్తగా పరిశీలించాలి. ముందు దీవిలోకి వెళ్ళి చూద్దాం. ఎవరైనా కనిపిస్తే మనకి సహాయం దొరకవచ్చు" అంటూ మహామాయుడు దీవిలోకి నడిచాడు.

కొంతదూరంలో ఆ దీవివాసులు కనిపించారు. మహామాయుడు మందాకిని కప్ప గురించి అడిగాడు.

"ఇక్కడ చాలా కప్పలు వున్నాయి. కాని ఆ పేరుగల కప్ప లేదు. అయినా కప్పలకు పేర్లు వుంటాయా!" అన్నారు.

"నేను మీ నాయకుడిని కలవాలి. ఆయన వల్ల మాకు ఏదైనా సహాయం దొరకవచ్చు" అన్నాడు మహామాయుడు.

"ప్రస్తుతం మా నాయకుడు దీవిలో లేడు. రేపుదయం వస్తాడు. ఈ రాత్రికి ఇక్కడే వుండండి" అన్నారు.

ఇద్దరూ బాగా అలసి వున్నందువలన, ఆ దీవి వాసులు చూపించగ చిన్న గుడిసెలో విశ్రాంతి తీసుకున్నారు.

అర్థరాత్రయింది. నిద్రలో వున్న ఇద్దరికి ఏదో పెద్ద శబ్దం వినిపించడంతో, వులిక్కిపడి లేచి, గుడిసె నుండి బయటికి వచ్చారు. శబ్దం ఎక్కడ నుండి వచ్చిందో తెలియలేదు. కాని ఓ అమ్మాయి ముందు వెళుతూ కనిపించింది.

ఆ అమ్మాయి ఎవరు? అర్థరాత్రి ఎందుకు ఇలా ఒంటరిగా వెళుతుందో తెలుసుకుందామని ఇద్దరూ మెల్లగా నడిచారు.

ఆ యువతి సముద్రతీరం వద్దకు వెళ్ళి చిన్నగా వింత శబ్దం చేసింది. మరుక్షణం చుట్టూ వున్న వేల కొలది కప్పలు ఆమె ముందుకు వచ్చాయి. కొన్ని క్షణాలకు ఆ యువతి కప్పగా మారి, ఆ కప్పలతో కలసి సముద్రంలోకి పోయింది. అంతా చూస్తున్న ఇద్దరికీ ఏమి అర్థం గాక, తిరిగి ఆ యువతి సముద్రం నుండి వస్తుందని ఎదురుచూసారు. కానీ ఎంతసేపు గడిచినా రాలేదు.

అంతలో మహామాయుడు, "చంద్రకాంత్! ఇక ఇక్కడ వుండడం మంచిది కాదు. ఈ దీవి వాసులు ఇక్కడికి వచ్చేంతలో మన గుడిసె వద్దకు వెళ్ళిపోదాం. అంతేకాదు మనం చూసిన అమ్మాయి నాయకుని కూతురులా వుంది. మనం చూసిన ఆ అమ్మాయి గురించి, ఎవ్వరికీ చెప్పకు. ముందు దీవి నాయకుని కలిసి, తరువాత దదీని గురించి ఆలోచిస్తాం అని అనడంతో, చంద్రకాంత్, నెమ్మదిగా మహామాయుని వెంట నడిచాడు.

మరునాడు తెల్లవారి మహామాయుని, చంద్రకాంత్‌ని గూడెంవాసులు నిద్రలేపారు.

"మీ నాయకుడు వచ్చాడా" అని అడిగిన మహామాయునితో "ఇంకా రాలేదు. ఇంకా కొద్ది సేపటిలో వస్తాడు. మీకు రాత్రి ఏమైనా శబ్దాలు వినిపించాయా" అని అడిగాడు.

చంద్రకాంత్ ఏదో చెప్పబోయేంతలో మహామాయుడు, "మాకు ఏ శబ్దం వినిపించ లేదు. ఇంతకీ ఏమి జరిగింది" అని అడిగాడు.

"రాత్రి గుడిసెలో పడుకుని వున్న మా నాయకుని కూతురు ఇపుడు కనిపించలేదు. మా నాయకునికి ఈ సంగతి ఎలా చెప్పాలో అర్థం కాలేదు" అన్నారు.

కొంతసేపటికి ఆ దీవి నాయకుడు అక్కడికి వచ్చి, వారి వివరాలు తెలుసుకున్నాడు. తన కూతురు మందాకిని కనిపించలేదని చెప్పడంతో కోపంగా అందరిని తిట్టి కాలితో కొట్టాడు. తరువాత అందరినీ ఈ దీవి అంతా వెదకి రమ్మని పంపాడు. మహామాయుని, చంద్రకాంత్ సంగతి పట్టించుకోకుండా వెళుతుండగా, మహామాయుడు తనకు కావలసిన మందాకిని కప్ప గురించి అడిగాడు.

"నాకు అటువంటి కప్ప గురించి తెలియదు. మీరు మా దీవి వదలి వెళ్ళండి. మీ లాంటి కొత్తవారు దీవిలోకి వసేత మాకు అపకారం జరుగుతుంది. ముందు వెళ్ళండి" అని కోపంగా వెళ్ళాడు.

"మహామాయా! ఈ నాయకుని కూతురులో ఏదో రహస్యం వుంది. ఆ సంగతి ఇక్కడివారికి తెలియదు. ముందు ఆ రహస్యం చేదించాలి. ఆ తరువాత మన కార్యం సులభంగా ముగుస్తుంది" అన్నాడు చంద్రకాంత్.

సరిగ్గా ఆ సమయంలో సముద్రంలో నుండి కప్పల మధ్య నుండి ఓ కప్ప యువతిగా మారి, దీవిలోకి రాసాగింది.

*(ఇంకా వుంది)*



# దేశ భక్తుడు



ఒకసారి భారతదేశ ప్రదాని కీ॥శే॥ లాల్ బహుదూర్ శాస్త్రి యుద్ధంలో గాయపడిన సైనికుల్ని పరామర్శించడానికి పంజాబులో వున్న లూదియానా హాస్పిటల్‌కు వెళ్ళారు.

కర్నల్ మాన్‌సింగ్‌ని ముందుగా చూడాలని అతని గదికి వెళ్ళాడు.

మాన్‌సింగ్ గొప్ప దేశభక్తుడు. లాల్‌బహుదూర్ శాస్త్రి అతని గురించి చాలా గొప్పగా విన్నందువలన ముందుగా అతన్ని చూడాలని అతని గదికి వెళ్ళాడు. ఆయన్ని చూడడంతో అతని కళ్ళ వెంట నీరు రావడం మొదలు పెట్టింది. శాస్త్రి ఆశ్చర్యంతో, "నువ్వు చాలా దైర్యవంతుడని విన్నాను. కాని నువ్వు కన్నీరు కార్చడం ఏమిటి" అన్నాడు.

"ఈ కన్నీరు అధైర్యపడిరాలేదు. మిమ్మల్ని పరామర్శించడానికి వచ్చిన మీకు, నేను కనీసం లేచి నిలబడి సెల్యూట్ చేయలేని స్థితిలో వున్నానే అన్న బాధ వలన కళ్ళ వెంట నీరు వచ్చింది" అన్నాడా దేశభక్తులు.

అది విన్న లాల్‌బహుదూర్‌శాస్త్రి గారి కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

ఎల్. శివరామ్, వరంగల్




ఆస్థానకవి రామశర్మ రాజగారి వద్దకు వెళ్ళి, "రాజా! మీ గురించి రాజ్యమంతా చెప్పుకుంటున్నారు నిజమా!" అడిగాడు.

"అది నిజమే. అసలు జరిగిందేమిటంటే, ఉదయం నేను ఉద్యానవనంలో విహరించడానికి నా అశ్వాన్ని అదిరోహిస్తుండగా, పట్టు తప్పి క్రింద పడ్డాను. ఆ శబ్దానికి అశ్వం బెదిరి, వెనక కాళ్ళతో నన్ను తన్నింది. ఆ దెబ్బకి నేను దూరంగా ఎగిరి పొదల్లో పడ్డాను. ఏ గాయం తగలలేదు. కాని ఆ సమయంలో సహారా వుంటున్న సిద్దన్న ఈ దృశ్యం చూసాడు. వాడు పరిగెత్తుకు వచ్చి నన్ను క్రింది నుండి లేపి, సపర్యలు చేసాడు. నాకు చాలా అవమానమనిపించింది. నేను ఆ సమయంలో ఒక్క సిపాయి మాత్రం వున్నందువలన, తటాయించుకుని, వాడికి నా ఉంగరాన్ని ఇచ్చి ఈ సంగతి ఎవ్వరికి చెప్పకూడదని హెచ్చరించాను" అని రాజా బాదపడ్డాడు.

"రాజా! ఏ సంగతైనా పెదవిదాటితే పృద్వి దాటుతుంది అంటారు. అలాగే జరిగింది" అన్నాడు రామశర్మ.

'పృద్వి దాటినా పరవాలేదు రామశర్మగారూ! ఈ సంగతి పడకటంటికి చేరితే, మా రాణుల ముందు చులకన అయిపోతానని భాదగా వుంది. దాని గురించి ఆలోచిస్తూ ఇక్కడే వుండిపోయాను" అన్నాడు రాజా.

"మహారాజా! దాని గురించి మీరు బాధ పడకండి. మీ రాణివాసంలో మీరు చులకన కాకుండా నేను చూస్తాను" అన్నాడు రామశర్మ.

"అదెలా కుదురుతుంది. ఈ పాటికి ఈ సంగతి అందరికి తెలిసి వుంటుంది. పైగా ఆ సంఘటనని

కె. కవిత, వరంగల్

ఇంకా ఎక్కువచేసి చెప్పివుంటారు. రాణులు నన్ను ఆట పట్టించడానికి ఎదురు చూస్తూ వుంటారు. నువ్వు నన్ను వారి నుండి రక్షించలేవు" అన్నాడు రాజు.

"రాజా! మీకు అభ్యంతరం లేకపోతే, నేను మీతోపాటు రాణీ వాసానికి వస్తాను. అక్కడ వారు మిమ్మల్ని ఆటపట్టించకుండా చూస్తాను" అన్నాడు.

రాజుగారు సమ్మతించి, తనతోపాటు రామశర్మని అంతఃపురానికి తీసుకువెళ్ళాడు.

అప్పుడు రాణీ సులోచన రాజుగారిని ఆట పట్టించాలని నోరు తెరిచి, వెనుకనే వస్తున్న రామశర్మని చూసి నోరు మూసుకుంది, కాని ఆమె ముఖంలో చిరునవ్వు వుంది.

అపుడు రామశర్మ, "మహారాజా! నేను చెప్పింది నిజం. ఆ వార్త అంతఃపురం వరకు చేరింది" అనడంతో రాణీ "ఏం జరిగింది. వివరంగా చెప్పండి" అన్నది.

"మహారాణీ! ఈ రోజు రాజుగారితో పుకారు త్వరగా పాకిపోతుందని చెప్పి, దాన్ని నిరూపిస్తాను అని చెప్పాను. అందువలన సిపాయి సిద్దన్నతో, రాజుగారు ఉద్యానవనంలో గుర్రంపై క్రిందపడ్డాడని, గుర్రం వెనక కాలితో రాజుగారిని తన్నిందని చెప్పాను. ఈ సంగతి ఎవ్వరికీ చెప్పకూడదని అతనితో చెప్పాను. కానీ సాయంకాలం సమయానికి ఈ వార్త నగరమంతా పాకిపోయింది. మహారాజా! ఇప్పటికైనా నేను చెప్పింది నమ్ముతారా. కాళ్ళు చేతులు లేకపోయినా పుకారు ఎంత దూరం అయినా వెళ్ళగలదు" అన్నాడు రామశర్మ.

"అయితే మేము విన్నది మీరు పుట్టించిన పుకారా! నేను రాజుగారిని ఆట పట్టించాలనుకున్నానే!" అంటూ లోపలకి వెళ్ళిపోయారు.

మహారాజు సంతోషంతో తన మెడలోని వజ్రాల హారం రామశర్మకి ఇచ్చి అతని సమయస్ఫూర్తికి ఎంతో మెచ్చుకున్నాడు.





# లవణాసురుడు

శ్రీరాముడు అయోధ్యానగరాన్ని పరిపాలిస్తున్న రోజులలో లవణాసురుడనే రాక్షసుడు అడవులలో దుర్భేద్యమైన కోట కట్టుకొని నివశిస్తూండేవాడు.

వాడు అరణ్యములలోని మృగములను వేటాడి చంపి తినటము, గాగుకుండా అక్కడి మునులను, జనులను బాదిస్తూ వారిని చంపి తినటము సాగించాడు. లవణాసురుని బాధల నుండి తమని రక్షించమని వేడుకోవడానికి అగస్త్యన్ మహాముని నాయకత్వంతో అడవులలోని మనుషులంతా అయోధ్యా నగరానికి వచ్చారు.

శ్రీరాముడు వచ్చిన మునులను ఆహ్వానించి అర్ఘ్యక పాద్యాదులు ఇచ్చి సుఖాసనులను చేసి "మహర్షులారా! స్వాగతం. సుస్వాగతం. మీ దర్శన భాగ్యం చేత నా జన్మ ధన్యమయింది. అందరూ క్షేమమే గదా! మీ తపస్సాధనలు, యజ్ఞయాగాదులు చక్కగా జరుగుతున్నవి గదా!" అంటూ కుశల ప్రశ్నలు వేశాడు.

మునులు "రామభద్రా! తమ దయవలన రాజ్యమంతటా ప్రజలు సుఖసంతోషాలతో వర్ధిల్లుతున్నారు. కాని అడవులలో ఉన్న మాకే ఇబ్బందులు వచ్చాయి" అన్నారు. "ధర్మరక్షణ ప్రజాక్షేమమే ధ్యేయంగా రాజ్యమేలుతున్న నా రక్షణలో ప్రజలకు ఇబ్బందులా! మీకు వచ్చిన ఆపదే ఏమిటి చెప్పండి. తక్షణమే తీరుస్తాను" అన్నాడు రాముడు.

చవన మహర్షి పైకి లేచి "రామచంద్రా అరణ్యంలో లోకభకరుడైన లవణాసురుడనే రాక్షసుడొకడున్నాడు. వాడు యధేచ్ఛగా అడవిలోని పెను మృగాలను చేతులతోనే చంపివేస్తూ జంతువులను భక్షించటమేగాకుండా ముని వాటన్‌లపై దండెత్తి, అందినంత మంది మునులను, అడవిలోని

కె.వి.ఆర్. హనుమంతరావు, హైదరాబాద్

ప్రజలను భక్షించి వేస్తున్నాడు. అతని ధాటికి అడవి లోని జంతుజలాలు అంతరించి త్వరలోనే అడవి జీవ సూన్యమైపోతుంది. మేము కూడా అరణ్యాలు వదిలివేసి ప్రాణాలు అరచేత పెట్టుకొని పారిపోయి మరో సురక్షత ప్రాంత చూచుకోవాలి. ప్రాణాలు అరచేతిలో పెట్టుకు బ్రతుకుతున్నాము" అన్నాడు.

రాముడు "ఇంతకి ఎవరా లవణాసురుడు! వాడి బలం ఏపాటిది. ఇంతటి బలం వాడికెలా వచ్చింది!" అన్నాడు.

చవన మహర్షి "రామచంద్రా! ఆ లవణాసురుడు బ్రహ్మ వరప్రసాది. ఇంద్రాది దేవతలను ఓడించాడు. అతని వద్ద శివప్రసాదితమైన 'శూలాయుధం' ఉంది. ఆ శూలం ధరించి వచ్చిన అతనిని ఎదిరిం చిన వారు బ్రహ్మాది దేవతలైన ఎదిర్చిపోరాడలేరు. శూల మహిమవలన పరాజతులు కాకతప్పదు. ఆ శూల మహిమ వలన బలగ్వరితుడై ఉన్నాడు. అతని బాధల నుండి మహర్షులను రక్షించు" అన్నాడు ముక్త కంఠంగా.

"అలాగే! త్వరలోనే అతన్ని అంతమొందిస్తాము" మీరు నిశ్చింతగా వెళ్లిరండి" అని వాళ్లకు వీడ్కోలు చెప్పాడు.

శ్రీరాముడు లక్ష్మణ భరత శతృఘ్నులను చూసి "విన్నారుగదా! లవణాసురుని సమాచారం. ఆ లవణాసురిని వధించి మునులకు అడవిలోని జను లకు శాంతిని చేకూర్చటం మన తక్షణ కర్తవ్యం" అన్నాడు. శతృఘ్నుడు "అగ్రజా! నేను వెళ్లి ఆ లవణాసురుని వధించి వస్తాను. నాకు ఆజ్ఞ ఇవ్వండి" అన్నాడు. శ్రీరాముడు తమ్ముని ఆశీర్వదించి "తమ్ముడూ! శంకర ప్రసాదితమైన శూలాయుధం



అతని వద్ద ఉంది. అది ధరించినవాడు యుద్ధానికి వస్తే వాడని ఎదిరించటం ఎవరికీ సాధ్యం కాదు. ఉపాయంగా అతన్ని ఎదిరించి అతనిని వధించు" అంటూ తన అంబుల పోదిలోని ఒక దివ్యాస్త్రం తీసి ఇచ్చి "దీనితో అతన్ని వధించు" అంటూ ఒక అస్త్రాన్ని ఇచ్చి "విజయీభవ!" అంటూ ఆశీర్వదించాడు.

శతృఘ్నుడు కొలది సైన్యంతో లవణాసురుడుంటే అరణ్యానికి వచ్చి సైన్యాన్ని దూరంగా వుంచి ధనుర్బాణాలతో తాను ఒక్కడే కాలినడకన లవ ణాసురుని కోట వద్దకు వచ్చాడు.

ఆ సమయంలో లవణాసురుడు ఆహార సేకరణకొరకు అడవిలోకి వెళ్లి అడవి దున్నలను, సింహాలను చంపి వాటిని భుజంపైకి వేసుకొని కోటకు వచ్చాడు. కోటలోకి వెళ్లబోతున్న లవణాసు రుని అడ్డుకొని ఎదురుగా నిల్చి "దానవా! నన్ను

దాటుకొని కోటలోకి వెళ్లటం అసాధ్యం. నన్ను జయించి కోటలోకి వెళ్లు" అన్నాడు శత్రుఘ్నుడు.

లవణాసురుడు "ఓరి మానవా! లవపుత్రుడా! నీకు ఎంత ధైర్యం? సరాసరి నాకోటకే వచ్చి నన్ను యుద్ధానికి పిలుస్తున్నావా!" ఇంక తిరిగి పోలేవు. నీ పెద్దలను తలుచుకో" అన్నాడు. చంపిన జంతువులను కింద పడవేసి యుద్ధానికి సిద్ధమవుతూ.

శత్రుఘ్నుడు "రాక్షసాధకా! అయోధ్యా నగరాన్ని ఏలుతున్న శ్రీరామచంద్రుని సోదరులను శ్రీరాముని ఆజ్ఞతో నిన్ను చంపాలనే ఇటు వచ్చాను" అన్నాడు విల్లుసారిస్తూ. లవణుడు "ఓహో! ఆ అల్పుడైన రావణాసురుని వధించిన ఆ రాముని తమ్ముడివా! రావణుని చంపినప్పుడే మీ అన్నను చంపాలను కున్నాను. అప్పుడేగదా అని అప్పుడు పేక్షించాను. సరే, ఇప్పుడు తప్పదు. ముందు నిన్ను వధించి తరువాత అయోధ్యపై దండెత్తికెళ్లి ఆ రాముని, మిగిలిన నీ సోదరులను వధిస్తాను కాచుకో" అంటూ చుట్టు ప్రక్కల నున్న వృక్షాలను వేళ్లతో సహా పెల్లగించి శత్రుఘ్నుపై విసిరాడు. అది అమాంతం పైన పడ దంతో శత్రుఘ్నుడు తూలి క్రిందపడి మూర్ఛపడి పోయాడు. చలనం లేకపోవడంతో "చచ్చిపోయాడు" అర్థకుడు అనుకుంటూ తాను కిందపడవేసిన జంతు కళేబరాలను భూమిపైకి ఎత్తుకొని లోనికి ప్రవేశించ పోయాడు.

శత్రుఘ్నుడు తెప్పరిల్లి పైకి లేచి, "నిలు! నిలు దానవా! నీవు లోనికి పోలేవు అంటూ దివ్యాస్త్రాన్ని సంధించి ఆ రాక్షసునిపైకి ప్రయోగించాడు. అది భూభోనంబోంతరాణాలు ధ్వని చేస్తూ, పర్వతంలాగ వున్న ఆ రాక్షసుని వక్ష స్థలాన్ని తాకి చీల్చివేసి పాతాళంలోకి పోయి తల శివత్రి శత్రుఘ్నుని వద్దకు చేరింది. రక్తధారలు ప్రవహిస్తూ, పర్వతంలా నేల కూలిపోయాడు రాక్షసుడు. రాక్షసుని హారణతో అతని ఇంటినున్న ఈశ్వర ప్రసాలిత దివ్యాస్త్రం వెలుగులో బయటకు వచ్చి కైలాసం చేరింది.





# కడివెడు తెలివి

ఒకసారి అక్బర్‌కు ఎందుకో బీర్బల్ మీద బాగా కోపం వచ్చి అతణ్ణి తక్షణమే ఆగ్రా నుంచి వెళ్ళిపొమ్మని ఆజ్ఞాపించాడు. బీర్బల్ మారు మాట్లాడకుండా సామాన్లన్నీ సర్దుకుని దూర ప్రాంతంలో వున్న ఒక మారుమూల పల్లెకు చేరుకున్నాడు. అతడు ఏ వూరికి వెళ్ళింది ఎవరికీ తెలియదు. కొన్ని వారాలు గడిచాక అక్బర్‌కు ఒక దేశం రాజు నుంచి ఒక వింత అభ్యర్థన వచ్చింది. "దయచేసి ఒక కడివెడు తెలివి వెంటనే పంపించండి" అని.

చక్రవర్తికి ఆ రాజు ఏం కోరుతున్నాడో అర్థం కాక తికమక పడ్డాడు. చింతాక్రాంతుడు కూడా అయ్యాడు. అన్నీ వున్న మొఘల్ చక్రవర్తి తాను. కానీ 'కడి వెడు తెలివి' అంటే ఏమిటి? ఒక వేళ తాను అది పంపించకపోతే రాజుల దృష్టిలో చులకనైపోతాడు.

"ఈ సమయంలో బీర్బల్ వుంటే ఎంత బాగుండేది. ఎలాగైనా అతణ్ణి వెంటనే వెనక్కి రప్పించాలి" అనుకున్నాడు.

అక్బర్ ఒక ఉపాయం ఆలోచించి ఒకో వ్యక్తికి ఒకో మేకను, ఒకో సందేశాన్ని యిచ్చి అన్ని గ్రామ పెద్దలకు పంపించాడు. "ఈ మేకను ఒక నెల రోజులు వుంచుకోండి. దాని పోషణ ఖర్చులు నేను యిస్తాను. సరిగ్గా ఒక నెల తర్వాత ఆ మేకను వెనక్కి పంపండి. అయితే యీ నెల రోజులలో అది ఏ మాత్రం బరువు పెరగకూడదు, తగ్గకూడదు. లేకుంటే మీకు కఠిన శిక్ష పడుతుంది" అనేది ఆ సందేశం.

ఆ సందేశం అందులోని అన్ని గ్రామాల పెద్దలు ఆశ్చర్యపోవటమే గాక విచారగ్రస్థులయ్యారు. ఆ సందేశం తాను నివాసం వుంటున్న వారి పెద్దకు కూడా రావటంతో బీర్బల్,

మేకల మదన్ మోహన్ రావు, మిర్యాలగూడెం

"అసాధ్యమేం కాదు. ప్రతిరోజూ సరిగ్గా ఒకే పరిమాణంలోనే మేత వేయండి. దాన్ని బాగా పోషించండి. ఆ తర్వాత దాన్ని ఒక బోనులో వుంచిన పులి ఎదురుగా కట్టెయ్యండి. నిరంతరం ప్రాణ భయంతో అది లావెక్కదు" అన్నాడు బీర్బల్.

అక్బర్‌కు వెంటనే అర్థమైంది. బీర్బల్ సలహా వల్లనే ఆ గ్రామ పెద్ద అలా చేయగలిగాడని. వెంటనే ఆ గ్రామానికి మనుషులను పంపించాడు. ఆ తర్వాత పొరుగు దేశం రాజు కోరిన కోరిక గురించి చెప్పాడు.

"ఓస్ అదెంత పని! నాకు కొద్ది వారాల సమయం యివ్వండి" అన్నాడు బీర్బల్.

ఇంటికి వచ్చి తమ తోట మాలిని పిలిచి ఒక గుమ్మడి గింజ తెచ్చివ్వమన్నాడు బీర్బల్. దాన్ని నాటి, ప్రతి దినం సక్రమంగా నీరు పెట్టాడు. త్వరలోనే ఆ గింజ మొలకెత్తి, కొన్నాళ్ళు తర్వాత ఆ మొక్క పూలు పూసింది. క్రమక్రమంగా ఆ గింజలు, లేత గుమ్మడి కాయలయ్యాయి. ఒక పిందెను ఒక మట్టి కుండలోకి పంపి దాన్ని అలాగే కొద్దిరోజులుంచాడు.

అలా అలా ఆ పిందె బాగా పెరిగి ఆ కుండ నిండా అయింది. అప్పుడు బీర్బల్ చెట్టు నుంచి దాని కాడను తెంపేసాడు. తర్వాత ఆ కుండ మూతి చుట్టూ ఒక గుడ్డ చుట్టి అక్బర్ దగ్గరికి తీసుకెళ్ళాడు.

"అయ్యా, ఇదిగోండి కడివేడు తెలివి. దీన్ని ఆ రాజుగారికి ఒక చిన్న సందేశంతో పంపండి "మీరు కోరిన కడివెడు తెలివి స్వీకరించండి. దయచేసి దాన్ని తీసుకుని ఖాళీ కడవ మాకు పంపించండి. కాని మీరు కుండెను గానీ, గుమ్మడి కాయను గానీ పగుల గొట్టొద్దు" అని అన్నాడు బీర్బల్.

ఆ సందేశం అందుకున్న ఆ రాజు ఉరుకులు పరుగుల మీద అక్బర్‌ను దర్శించుకుని, "మీ తెలివిని తక్కువగా అంచనా వేసినందుకు క్షమించండి" అని వేడుకున్నాడు. బీర్బల్ తెలివి తనను కాపాడినందుకు ఆనందించాడు అక్బర్.



# ప్రపంచంలో ఎత్తైన అక్వేరియమ్

ఈ రోజుల్లో పెంపుడు జంతువులు, పక్షులు, చేపలు మొదలైన హాబీలెన్నో బహుళప్రాచుర్యం పొందటమే కాదు ప్రతి కుటుంబం మరో ప్రాణికి పెంపకం పేరిట ఆసరా కల్పించటం అభినందనీయం. చేపలను పెంచడంలో చాలా మంది మక్కువ చూపిస్తారు. చిన్న పిల్లలయితే మరీ ఇష్టపడతారు. అంతేకాదు నీళ్ళలో చలాకిగా ఈదులాడే చేపల్ని తదేకంగా గమనిస్తే 'డిప్రెషన్' వంటి ఇబ్బందులు దూరమవుతాయి. చేపల నుంచే అద్దాల బాక్సును అక్వేరియం అంటారు. ప్రపంచంలోనే అతి ఎత్తుగా వుండే అక్వేరియం ఎక్కడుంది? దాని విశేషాలు ఏమిటి అనే విషయం పరిశోధింగా తేలిందేమిటంటే...

అతి ఎత్తైన అక్వేరియం జర్మని దేశ రాజధాని నగరమైన బెర్లిన్‌లో వుంది. 82 అడుగుల ఎత్తు 36 అడుగుల చుట్టు కొలత కలిగి వుంటుందీ అక్వేరియమ్! 8 అంతస్థుల ఎత్తుండే భవనం అంత ఎత్తు అన్నమాట! ఈ భారీ అక్వేరింయంలో నీరెంత పడుతుందో తెలుసా! ఏకంగా 10 లక్షల లీటర్లు! మంచి నీరు కాదులెండి! 10 లక్షల లీటర్ల సముద్రపు నీటిని నింపుతారు. ఇందులో 50 జాతులకు చెందిన 1600 రంగు రంగుల చేపలుంటాయి. రాడిసన్ అనే హోటల్‌లో వుంది ఈ అక్వేరియమ్. దీనికో పేరు కూడా ఉంది. అదే ఆక్వాడోమ్. దీనిని నిర్మించడానికి మన కరెన్సీలో చెప్పాలంటే 72 కోట్ల రూపాయలు ఖర్చు అయింది. అక్వేరియమ్ మధ్యలో రెండస్థుల ఎత్తుండే 25 టన్నుల గాజుతో చేయబడి ఎలివేటర్ అమర్చారు. ఈ ఎలివేటర్‌లో ఒకేసారి 49 మంది చేపలన్ని చూస్తూ దాకా వెళ్ళి రావచ్చు. ఆర్సిలిక్ అనే ప్రత్యేక గాజుతో చేయబడ్డ గుండ్రని ఎలివేటర్ దృఢంగా వుంటుంది. అత్యాధునిక పంపింగ్ యంత్రాల సహాయంతో నీరు టాంకులోకి నిరంతరంగా తిరుగుతునే వుంటుంది. ప్రతి గంటకు 10 లక్షల సముద్రపు నీరు 33 టన్నుల ఉప్పు చేరుతూ వుంటుంది. 2003లో నిర్మించబడ్డ ఈ అక్వేరియమ్ వింతకాని ప్రపంచ వింత!

శ్రీమతి టి. లక్ష్మి, హైదరాబాద్

# పుచ్చకాయల మ్యూజియం

వేసవి వచ్చిందంటే ఎన్నోపండ్లు మార్కెట్టులోకి వస్తుంటాయి. ముఖ్యంగా పుచ్చకాయ (Water Melon) లు విరివిగా వస్తాయి. పైన ఆకు పచ్చరంగులో వుండే ఈ పండు కోస్తే నోరూరించే ఎర్రటి ఎరుపు రంగులో వుంటుంది. పేరుకు తగ్గట్టే నీరు అధిక శాతం (92%) అంటే 82 శాతం వుండడంతో మండు వేసవిలో పుచ్చకాయను తింటే కడుపులో ఎంతో చల్లగా వుంటుంది. పైగ ఖరీదు కూడా అంత ఎక్కువ కాకపోవటంలో సామాన్యులకు సైతం అందుబాటులో వుంటుందీపండు! 5000 సంవత్సరాలకు పూర్వమే ఈజిప్టులో పుచ్చకాయను పండించినట్లు తెలుస్తున్నది. చైనా దేశంలో పుచ్చకాయను వాణిజ్యపరంగా పండించటంలో ప్రపంచంలోనే అగ్రస్థానం పొందింది. ఆ దేశ ఆదాయం పుచ్చకాయల నుండి వచ్చే ఆదాయము గణనీయంగా వుండటంతో ఆ దేశం ఒక విచిత్రమైన మ్యూజియం నిర్మించింది. పుచ్చకాయ ఆకారంలో నిర్మించబడ్డ ఈ పుచ్చకాయ మ్యూజియం ఒక అద్భుతం! ప్రపంచ వ్యాప్తంగా పండించబడే పుచ్చకాయలన్నిటిని మనం అక్కడ గమనించవచ్చు! రుచి చూడవచ్చు!

చైనా దేశ రాజధాని నగరం బీజింగ్‌లో ఈ మ్యూజియం వుంది. ఈ మ్యూజియం రెండు భాగాలు నిర్వహిస్తారు. ఒక భాగంలో పుచ్చకాయ పుట్టు పూర్వోత్తరాలు, ప్రపంచంలోనే అతి పెద్ద పుచ్చకాయల తోట వివరాలు, ఏ ఏ దేశాలలో ఏ ఏ రకాలు పండిస్తారో మొదలైన వివరాలు ప్రదర్శిస్తారు. మరో భాగంలో వివిధ సందర్భాలలో వివిధ కవులు పుచ్చకాయను కీర్తిస్తూ రచించిన కవితలు, పద్యాలు, 100 దేశాలలో పండించే 1200 రకాల పుచ్చకాయల చిత్రాలు చూడొచ్చు. జపాను దేశంలో పుచ్చకాయలను చదరపు ఆకారంలో పండించటం విశేషం! ఆఫ్రికా ఖండంలోని కల్హారి ఎడారిలో పుట్టినట్లు చెప్పబడే ఈ పుచ్చకాయ ఇష్టపడని వారు చాలా అరుదు! 2005 సంవత్సరంలో ఇంగ్లాండు దేశంలోని ఒక తోటలో 122 కిలోల బరువుండే పుచ్చకాయ పండించినట్లు గిన్నిస్ బుక్ ఆఫ్ రికార్డులలో నమోదయింది. అలాగే లేవలిస్ అనే వ్యక్తి పుచ్చకాయలోని గింజను నోటితో 68 అడుగుల 9 అంగుళ దూరం ఉమ్మి మరో గిన్నిస్ రికార్డు సాధించాడు.

జి. సాయి హిమబిందు, హైదరాబాద్

# విలియం షేక్స్‌పియర్

షేక్స్‌పియర్ పేరు తెలియని వారెవరూ ఉండరంటే అతిశయోక్తి కాదు. ఇతను స్ట్రాట్ ఫోర్డ్‌లో 1464లో మధ్య తరగతి కుటుంబంలో జన్మించాడు. హెన్లీ వీధిలో వారిల్లు ఉండేది. అతని తండ్రి అయిన జాన్ షేక్స్‌పియర్ మేజోళ్ళు, ఊలు వస్తువుల డీలర్‌గా పనిచేసేవాడు. షేక్స్‌పియర్ ప్రయిమరీ, హై స్కూలు చదువులు గ్రామరేస్కూల్లో పూర్తయింది. అతనికి 18 సంవత్సరాల వయస్సులోనే ఆనీహాతేవే అనే అమ్మాయితో వివాహం జరిగింది.

షేక్స్‌పియర్ బాల్యమంతా హెన్లీ వీధిలోని ఆ ఇంట్లోనే గడిచింది. వివాహమయిన తర్వాత అతను లండనకు తన నివాసాన్ని మార్చాడు. అక్కడ అతను ఒక యాక్టింగ్ కంపెనీలో మెంబరుగా చేరాడు. నాటకాలు రాయడమన్నది అప్పటి నుంచే ఆరంభమయింది. అతను నాటకాల్లో కూడా నటించేవాడు. కానీ అతని నటన గురించి వివరాలు ఎక్కువగా తెలియలేదు. హామ్‌లెట్ నాటకంలో ఘోస్ట్‌గానూ, యాజ్ యు లైక్ ఇట్‌లో వృద్ధుడయిన ఆదంగానూ నటించి గుర్తింపు పొందినట్లుగా తెలుస్తోంది.

షేక్స్‌పియర్ తిరుగులేని రచయితగా ఎన్నో నాటకాలు రచించి ప్రపంచ వ్యాప్తంగా ఎంతో పేరు ప్రఖ్యాతలు పొందాడు. ఆయన రచనలు, ఆయనను శ్రీ మంతుడిని చేసాయి. ఆయన స్ట్రాట్ ఫోర్డ్‌లో అతి పెద్దదయిన తన స్వంత భవనంలో నివసించే ఉన్నతమ్మయిన స్తితికి చేరుకున్నాడు. ఆ భవంతిలోనే అతని జీవితకాలమంతా గడచిపోయింది. 1616వ సంవత్సరం, ఏప్రియల్ 3వ తేదీన ఆయన స్వర్గస్థులయ్యారు. మరణించే సమయానికి ఆయన వయస్సు 52 సంవత్సరాలు. షేక్స్‌పియర్ మరణించినప్పటికీ, ఆయన రచనలు, ఆయన జ్ఞాపకాలు ఆయన ప్రతిభ సజీవంగా ఉన్నాయి ఈ నాటికీ.

కె. నిర్మల, ఒరిస్సా



# రాజుకు జ్ఞానోదయం

అమరావతి రాజ్యాన్ని చంద్రసేనుడు అనే రాజు పరిపాలిస్తుండేవాడు. అతని మంత్రి పేరు సుబుద్ధి. ఒకరోజు చంద్రసేన రాజు గారికి నిద్రలో కల వచ్చింది. ఆ కలలో ఒక అద్భుతమైన భవనం నేలమీద ఆనకుండా గాలిలో తేలుతున్నట్లు కనిపించింది. అంత అందమైన భవనం తన సొంతం చేసుకో దలచిన చంద్రసేనుడు తెల్లవారుతూనే 'ఆహా నిన్న రాత్రి కలలో వచ్చిన భవనము ఎంత అందంగా వుంది. అది నిజమైతే నా జన్మ ధన్యమైనట్టే. ఇలాంటి అద్భుతాలు కలలోనే జరుగుతాయి కాబోలు ఆ కలనే ఎలాగైనా నిజం చేసుకోవాలని అని' ఎవరైనా అలా గాలిలో తేలే భవనం నిర్మిస్తే వారికి తన అర్థరాజ్యం ఇస్తానని రాజ్యం అంతట చాటింపు వేయించాడు.

కొద్ది రోజుల తర్వాత ఒక వృద్ధుడు రాజు గారి దర్శనార్థ సభా మందిరానికి వచ్చాడు.

"తాతగారు ఎవరు మీరు. ఎక్కడ నుండి వచ్చారు. నా నుండి ఏ సహాయం కోరు తున్నారు" అని అడిగాడు రాజుగారు.

"మహారాజా ,నా పేరు శివయ్య. సుబ్బరాయుడు సత్రం నివాసిని. నాకు మీరు న్యాయం చేయమని వేడుకునేందుకు వచ్చాను" అన్నాడు ఆ వృద్ధుడు.

ఎవరు మీరు అన్యాయం చేసినవాళ్ళు చెప్పండి. వాళ్ళు ఎంతటి వాళ్ళయినా నేను శిక్షిస్తాను" అన్నాడు రాజుగారు.

"మహాప్రభో నాకు అన్యాయం చేసింది తమరే. నిన్న రాత్రి మా ఇంట్లో చొరబడి నా

బెల్లంకొండ నాగేశ్వరరావు, చెన్నై

సొత్తు అంతా మీ భటులతో దోచుకెళ్ళారు" అన్నాడు వృద్ధుడు.

నీకేమైనా పిచ్చి పట్టిందా. అసలు మతివుండే మాట్లాడుతున్నావా. ఎదురుగా ఎవరు వున్నారో తెలుస్తుందిగా! నేనే పది మందికి దానాలు చేసేవాడను, దేశానికి రాజును నేను దోచుకోవడం ఏమిటి" అన్నాడు రాజుగారు.

"అవును ప్రభూ. మీరు నా కలలో కనిపించి నా ఇంటి సొత్తు మొత్తం దోచుకెళ్ళారు" అన్నాడు వృద్ధుడు

"కలలు నిజమౌతాయా అమాయకుడిలా ఉన్నావు యిలా ఎక్కడైనా విన్నామా చూసామా నేను తలచుకుంటే నీకు ఏ శిక్షనైనా విధించ గలను. పోనీలే వృద్ధుడని వూరుకున్నాను. కానీ నీ ప్రవర్తన మితిమీరి పోతుంది. ఇప్పటికైనా నీ తప్పుని తెలుసుకొని నీ ప్రవర్తన మార్చుకుని నన్ను క్షమాపణలు అడుగు. వృద్ధుడవన్న జాలితో క్షమాభిక్ష పెడతాను అన్నాడు" రాజుగారు.

"కలలు నిజం అవుతాయనే కదా పునాదులు లేకుండా గాల్లో తేలే ఇల్లు నిర్మించే తలంపు మీకు వచ్చినప్పుడు నా కల ఎందుకు నిజం కాదూ" అన్నాడు వృద్ధుడు.

విషయం అర్థమైన రాజుగారికి "కలలు కల్లలే" అని జ్ఞానోదయం కలిగింది.

"నువ్వు చెప్పింది నిజమేతాత. కలలు నిజం కావు అని నాకు నీ ద్వారా తెలిసి వచ్చింది" అన్నాడు రాజుగారు.

"తమరికి ఈ విషయం అనుభవ పూర్వ కంగా తెలియ జేయడానికే ఈ వేషం" అంటూ తన మారువేషాన్ని తీసివేసాడు మంత్రి సుబుద్ధి.

మంత్రి తెలివి తేటలకు రాజు సభలోని వారంతా ఆనందించారు.



# పిసినారి



సిరికొండ గ్రామానికి చెందిన దానయ్య పరమ లోభి మాత్రమే కాదు. మతి మరుపు మ
కూడాను.

ఒకసారి అతడు పనిమీద తెల్లవారకముందే తన ఒంటెద్దు బండిలో ప్రయాణమయ్యా
కొద్దిదూరం వెళ్ళిన తర్వాత తాను తన ఇంట్లోని నూనె దీపాన్ని ఆర్పి వెయ్యలేదనీ, ఆ న
వ్యర్థమైపోతుందని జ్ఞాపకం వచ్చింది. వెంటనే దానయ్య ఇంటికి తిరుగు పయనమయ్యాడు

ఇంటిలో తలుపు తీసిన అతని భార్య దానయ్యను చూచి ఆశ్చర్యపోయింది. "
వచ్చారేమండీ" అని అడిగింది.

"నేను ఇంట్లోని నూనె దీపం ఆర్పి వెయ్యడం మరిచిపోయాను. అందువల్ల న
వ్యర్థమవుతుందని దీపం ఆర్పివెయ్యడానికి వచ్చాను" అని చెప్పాడు.

అప్పుడు అతని భార్య "మీరెంత పిచ్చివారండీ! మీ బండి చక్రాలు, ఎద్దు గిట్టలు
అరిగాయో మీరు గమనించనే లేదు. అంతకన్నా ఆ నూనె విలువైనదా" అని అన్నది.

"నాకు ఆ మాత్రం తెలియదనుకున్నావా! అందుకే బండిని, ఎద్దును అక్కడనే వదిలి
వచ్చాను" అని అన్నాడా పిసినారి.

సంగనమల్లి రామకిష్టయ్య, ధర్మ

# 'చిట్కా'యణం

1. డిటర్జెంట్ (బట్టలుతికే) సబ్బు ముక్కలు మరీ చిన్నవైపోతే వాటిని చిన్న గుడ్డలో ఉంచి గుడ్డలపై రుద్దితే పూర్తిగా ఉపయోగపడుతుంది. ఇందుకు హాండ్ ఖర్చీఫ్‌ను వాడితే అది కూడ శుభ్రమైపోగలదు.
2. టాయ్‌లెట్ సోపులు ఒంటికి రుద్దుటకు వీలులేనంత చిన్నవైపోతే వాటిని రాత్రంతా నీటిలో వేసి ఉంచి ఉదయం నీటితో నేలను శుభ్రపరచవచ్చు. నేలమీద రాళ్ళు శుభ్రపడతాయి. సువాసన వస్తుంది. ఈ నీటితో ప్లాస్టిక్ కుర్చీలు, స్టూళ్లు, సామానులు కూడ తుడవవచ్చు.
3. చాయ్/కాఫీ లేదా తీపితో నోరు తీపిగా ఉంటుంది. వెంటనే నోట్లో పోక వక్కలకు బదులుగా అల్లం ముక్క దాల్చిని చెక్క లేదా కరక్కాయ ముక్క వేసుకుంటే సరి. తీపి వల్ల బాక్టీరియా తయారవదు. ఇవేం వద్దనుకుంటే నీటితో నోటిని శుభ్రంగా కడుక్కోవాలి. అంతే.
4. అల్లం ముక్కల్ని ఉప్పులో పులిమి, నిప్పుపై కాల్చి ఉంచుకొని, అప్పుడప్పుడు బుగ్గన పెట్టుకోవాలి. అందువల్ల జీర్ణశక్తి వృద్ధి చెందుతుంది.
5. మిగిలిపోయిన కూరల్ని అలాగే వాడకూడదు. పొయ్యి మీదుంచి, వేడిచేసి వేడిగా వాడుకొనవచ్చును.
6. ఉదయం పూట చన్నీటి శిరస్నానం ఎంతో మంచిది. దినమంతా తాజాగా, ఉత్సాహంగా ఉంటుంది.
7. రాత్రిళ్ళు గోరువెచ్చని నీటితో స్నానం చేస్తే, అలసట తీరిపోతుంది. నిద్రకు దోహదం చేస్తుంది.
8. దినంపూట బలమైన ఆహారం, రాత్రిళ్ళు తేలిగ్గా జీర్ణమయ్యే ఆహారం సేవిస్తే ఆరోగ్యానికి ఎంతో మంచిది.
9. దినంపూట కాఫీ/టీలు మితంగా వాడితే ఉత్సాహంగా వుంటుంది. రాత్రిపూట పడుకొనే ముందు పాలు తాగితే ఒంటికి మంచిది. నిద్రకు దోహదం చేస్తుంది.
10. ఒంటి దురదలతో బాధపడేవారు, ఘాటైన టాయ్‌లెట్ సోపులు వాడకూడదు. స్నానం ముగించాక ఐదు, పది నిమిషాలు గడిచాక కొబ్బరినూనె లేదా నువ్వుల నూనెతో తేలికగా రుద్దుకోవచ్చు.

వి. పద్మావతి, మెట్‌పల్లి





# బాణాసురుడు

బలి చక్రవర్తి కుమారుడు బాణాసురుడు, మహాబలశాలి, వేయి చేతులు కలవాడు. అతడు ఒకనాడు కైలాసానికి వెళ్లగా కుమారస్వామిని తన తొడ మీద కూర్చోబెట్టుకొని ముద్దాడుతున్న పరమశివుడు కన్పించాడు. బాణాసురుడిలో భావోద్వేగము కలిగింది, తన తండ్రి బ్రతికుయున్న నన్ను ఈ విధంగా లాలించేవాడు కదా! అనుకొని పరమేశ్వరుడిని అనుగ్రహం కొరకు తపస్సు చేయసాగాడు.

బాణాసరుడి భక్తికి మెచ్చిన పర మేశ్వరుడు అతని ముందు ప్రత్యక్షమై 'ఏం కావాలో' కోరుకొమ్మన్నాడు. "ఈశ్వరా! కుమారస్వామిని ఏ విధంగా చూచు కున్నావో నన్ను కూడా కుమారు నిగా స్వీకరించు" అన్నాడు. ఈశ్వరుడు బాణాసురుడి భక్తికి మెచ్చి అతనికి శోణపురం

అనే నగరాన్ని నిర్మించి దానికి కాపలాగా పా
పరమేశ్వరులు వసించసాగారు.

బాణాసురుడి కుమార్తె ఉష. అతి
సౌందర్యవతి. ఆమె కలలో శ్రీ కృష్ణుడి మన
అనిరుద్ధుడిని కాంచి ప్రేమించింది. ఈ విష
తన చెలికత్తె చిత్రరేఖకు తెల్పింది. చిత్రరేఖ
మాయాజాలంతో అనిరుద్ధుడిని ఉష దగ్గ
తీసుకొని వచ్చింది.

అనిరుద్ధుడు, ఉష ఆ భవనంలో గాం
వివాహం చేసుకొని సుఖంగా జీవించసాగ
ఉష భవనంలో ఎవరో పరపురుషుడు తి
తున్నాడన్న విషయం గ్రహించిన ద్వారపాలక
బాణాసురుడి వద్దకు వెళ్లి విషయాన్ని వివరించ

బాణాసురుడు ఆగ్రహంగా ఉష భవ
చేరుకున్నాడు. అనిరుద్ధుడని చూచి ఆగ్రహ

ప్రతాపురం రామానుజాచారి, హన్మకొండ

"ఓరి! ఎవరివి నీవు? నా ఆజ్ఞ లేకుండ మా అమ్మాయి అంతఃపురంలో చేరినందుకు నా బాణాగ్ని జ్వాలలకు నిన్ను ఆహుతి చేస్తాను" అన్నాడు.

"మహారాజా! నేను శ్రీకృష్ణుడి పౌత్రుడను, ప్రద్యుమ్నుని కుమారుడను. మీ ఉషను గాంధర్వ పద్ధతిన వివాహమాడాను. మీకు జామాతను" అన్నాడు అనిరుద్ధుడు.

శ్రీ కృష్ణుడి పౌత్రుడను అనేసరికి బాణాసురుడు కోపంతో అనిరుద్ధుడి మీద యుద్ధానికి దిగాడు. ఇద్దరి మధ్య జరిగిన హోరా హోరి పోరులో బాణాసురుడు అనిరుద్ధుడి బాణాల ధాటికి ఆగలేక చివరికి నాగాస్త్రం సంధించాడు. నాగాస్త్రముకు అనిరుద్ధుడు బంది అయినాడు.

ఇంతలో ద్వారపాలకుడు వచ్చి, "ప్రభూ! మీ రథకేతనం కూలిందన్నాడు". బాణాసురుడు రథపతాకం నేలకూలినందుకు శ్రీ కృష్ణుడు తనతో యుద్ధానికి రానున్నాడని గ్రహించి భటులతో అనిరుద్ధుడిని కారాగారములో వేయండి" అని ఆజ్ఞాపించాడు.

శ్రీ కృష్ణుడు తన చక్రాయుధముతో బాణాసురుడి వేయి భుజాలు ఛేదించాడు. బాణాసురుడి శిరమును మరొకసారి చక్రాయుధముతో దను మాడబోయేసరికి పరమేశ్వరుడు వచ్చి అడ్డుకొన్నాడు. "కృష్ణా! వీడు నా భక్తులు వేయి చేతులు ఖండించడంతో బలదర్పం అణిగిపోయింది దయ చేసి సంహరించవద్దు" అన్నాడు.

పరమేశ్వరుడి మాటలతో శ్రీకృష్ణుడు చక్రాయుధాన్ని ఉపసంహరించుకొన్నాడు.

బాణాసురుడు శ్రీ కృష్ణుడిని వేడుకొని తన కుమార్తెను, అనిరుద్ధుడిని అప్పగించాడు. వారితో పాటు అనేక దివ్యాభరణములు ఒసగాడు. వారందరిని వెంటబెట్టుకొని ద్వారకకు చేరుకొన్నాడు వాసుదేవుడు.



# ఆణిముత్యాలు

★ స్నేహమనేది రెండు దేహాలలో ఉండే ఒకే ఆత్మ. - అరిస్టాటిల్

★ సజ్జనులు ఏది న్యాయమో చూస్తారు. అల్పులు ఏది లాభమా అని ఆలోచిస్తారు. -సర్.జె. రేనాల్డ్

★ వివేకి సలహాల కోసం చూస్తే, మూర్ఖుడు పొగడ్తల కోసం పడి చూస్తాడు. -జోసఫ్ కాలిన్

★ అంతరాయాలు కలుగుతున్న కొద్దీ సంకల్పాన్ని ధృఢతరం చేసుకుంటూ పోవాలి. -శ్రీరమణ మహ

★ అదృష్టం కోసం ఎదురు చూడ్డమంటే మృత్యువుకోసం ఎదురు చూడడమే. -మహావీ

★ ఇద్దరి మధ్య వైరం సంభవించిందంటే అందుకు వారిలో ఒక్కరే కారణం కావచ కాని అది దీర్ఘకాలం సాగిందంటే ఇద్దరూ బాధ్యులే. -థామస్ పు

★ ఎంతకాలం జీవించామన్నది కాదు లెక్క ఎంత గౌరవంగా ఎంత సంతోషం జీవించామన్నది లెక్క -ఎమర్

★ ఒక్కోసారి మనం చేయగలిగిన పనులకన్నా చేయకూడని పనులు, తెలుసుకోవ చాలా అవసరం. -ఫ్రాం

★ ఓటమి అనేది కుంగిపోవలసినది కాదు. మరింత మెరుగైన స్థితికి చేరుకోవడా పనికివచ్చే నిచ్చెన అది. -ఫిలి

★ కష్టకాలంలోనే మిత్రుడెవరో తెలుస్తుంది. -గా

★ కాలం ఆగదు. కనుక ఉన్నప్పుడే ఉపయోగించుకోవాలి. వివేకానంద స్వా

కల్పనాకిరణ్, కందుక

# లండన్ 'ఐ' ఒక మహాద్భుతం

2000 సంవత్సరంలో మిలినీయం ప్రారంభమయిన సందర్భంలో ప్రపంచమంతా ఎన్నో సంబరాలు జరిగాయి. బ్రిటను దేశపు రాజధాని నగరమైన లండన్ మహానగరంలో ఆసంధర్భంగా 'లండన్ ఐ'ని నిర్మించారు. లండన్ ఐ అనేది ఒక అతి పెద్ద రంగులరాట్నం వంటి వలయాకార నిర్మాణం! తర్వాతి సంవత్సరాలలో తప్పక సందర్శించాల్సిన ప్రదేశాలలో ఒకటిగా మారిపోయిందీ రంగులరాట్నం. లండను మహానగరానికే కాక యావత్తు బ్రిటన్ దేశానికే తలమానికంగా మారిపోయింది. మిలీనియం సందర్భంగా నిర్మించినందుకు దీనిని మిలినియమ్ వీల్ అని కూడా అంటారు. థేమ్స్ నది దక్షిణ ఒడ్డున విశాలమైన ప్రదేశాలలో నిర్మించిన ఈ రంగులరాట్నం 440 అడుగుల ఎత్తుంటుంది. అద్దాలతో చేసిన 40 కంపార్టుమెంటులు కలిగి వుంటుంది. ఒక్కో కంపార్టుమెంటు బరువు 10 టన్నులు. అన్ని కంపార్టుమెంటులు AC చేయబడ్డాయి. ఒక్కో దాంట్లో 25 మంది సౌకర్యంగా కూర్చునే వీలుంది. అంటే ఒకసారిగా 1000 యాత్రికులు ఇందులో ఎక్కవచ్చు. అతి మెల్లగా తిరిగే ఈ లండన్ ఐ ఒకసారి పూర్తిగా తిరగడానికి 30 నిమిషాలు పడుతుంది. అద్దాలతో వుండడం వల్ల లండను మహానగరాన్ని నాలుగు ప్రక్కల నుండి గమనించవచ్చు. పై భాగం చేరినపుడు మనం పొందే అనుభూతి స్వయంగా తెలుసుకోగలమేగాని వర్ణనకు వీలులేదు.

40–50 కిలోమీటర్ల దూరం నుండి కనిపిస్తుండే ఈ మహాచక్రం లండను చేరుతున్న వారందరిని తనవైపు ఆకర్షించుకుంటుందని చెప్పనక్కరలేదు! రాత్రుళ్ళ సమయాలలో దీని సౌందర్యం మరింత ద్విగుణీకృతం అవుతుంది. దీని మీద అమర్చిన విద్యుత్ దీపాలు, ఆ విద్యుత్ దీపాలు థేమ్స్ నది నీటిలో ఏర్పడితే ప్రతిబింబాలు మనల్ని మరో లోకంలోకి తీసుకు వెళ్తాయి. భూమి నుండి ఆకాశంలోకి తీసుకెళ్ళి మళ్ళీ ఆకాశం నుండి భూమి మీదకు తీసుకు వచ్చే ఈ మహాద్భుతాన్ని ఈసారి లండను వెళ్ళిన వారందరు విధిగా సందర్శించి మహానుభూతిని పొందవచ్చు. దీంట్లో ఎక్కడానికి టికెట్టు ఖరీదు ప్రతి ఒక్కరికి 14.50 పౌండ్లు అంటే మనదేశ కరెన్సిలో రూ.1000 మాత్రమే! 2008 సంవత్సరంలో సింగపూరులో దీనికన్నా 101 అడుగులు ఎత్తుండే (అంటే 541 అడుగుల) రంగుల ర్నాటం నిర్మించారు.

జి. ప్రభాకర్ రావు, హైదరాబాద్



# పట్నం వాళ్ళు

రమణయ్య పట్నం మొదటిసారి వచ్చి తన పని ముగించుకుని తిరిగి తన గ్రామం వెంకటాపురం వెళ్ళడానికి బస్‌స్టాండ్‌కి వచ్చాడు. బస్టాండ్‌లో చాలా బస్సులు వున్నాయి. చదువురాని రమణయ్య.

దగ్గరలో సూటు, బూటు వేసుకుని, కళ్ళకు నల్లద్దాలు పెట్టుకొని వున్న వ్యక్తి వద్దకు వెళ్ళి "అయ్యా! ఈ బస్సు ఎక్కడికి వెలుతుంది" అడిగాడు రమణయ్య.

ఆ పెద్ద మనిషి తన వైపు చూడకుండా తనకి తెలియదని సమాధానమిచ్చాడు.

రమణయ్య ఎదురుగా మరో ఆసామి రావడంతో రమణయ్య అతన్ని ఆపి, "ఈ బస్సు ఎక్కడికి వెళుతుంది? మా గ్రామ వెంకటాపురం వైపు వెళుతుందా" అడిగాడు.

ఆ వ్యక్తి రమణయ్యని ఎగాదిగా చూసి తన
తెలియదన్నట్టుగా తల వూపి వెళ్ళిపోయాడు.

ఒక వ్యక్తి వేగంగా వస్తుండగా రమణం
అతన్ని ఆపి, "అయ్యా! నేను పల్లెటూరివాడి
చదువు నాకు రాదు. ఈ పట్నానికి చిన్న పనిమీ
వచ్చాను. తిరిగి మా గ్రామం వెంకటాపు
వెళ్ళాలి. ఈ బస్సు మా గ్రామం వైపు వెళుతుం
కాస్తా చూసి చెప్పండి" అని అడిగాడు.

ఆ వ్యక్తి కోపంతో, "నాకు వేరే ఏ
లేదనుకున్నావా. ఏ బస్సు ఎక్కడికి పోతుం
చెప్పటానికి నేను బస్టాండ్‌లో ఉద్యోగంలో లే
వెళ్ళు" అని వేగంగా వెళ్ళిపోయాడు.

రమణయ్య అదిరిపడ్డాడు. తాను ఏం తప్పు
అడిగాడని ఆ వ్యక్తి అంతగా విరుచుకుపడ్డా
ఈ పట్నం వాళ్ళకు అహంకారం ఎక్కువ. తా

కె. నాగమల్లిక, తిరుపతి

ఎక్కువగా చదువుకున్నామని, పల్లెటూరి వాళ్ళను కించపరుస్తుంటారు. ఈ పట్నం నాకు అసలు నచ్చలేదు. మా గ్రామంలో అందరూ మంచి మనసు వున్నవాళ్ళు. ఇక చచ్చినా ఈ పట్నంవైపు రాకూడదు" అని మనసులో బాధపడ్డాడు.

అంతలో డ్రైవరు, కండక్టర్ ఆ బస్సులో ఎక్కారు. జనం లోపల ఎక్కసాగారు. రమణయ్య కండక్టర్ వద్దకు వెళ్ళి "అయ్యా! ఈ బస్సు వెంకటాపురం పోతుందా" అడిగాడు.

"వెళుతుంది. త్వరగా లోపలికి ఎక్కు" అని కండక్టరు చెప్పడంతో రమణయ్య సంతోషంగా బస్సులో ఎక్కి కూర్చున్నాడు.

బస్సు బయలుదేరు సమయానికి తనకు సమాధానం చెప్పని ముగ్గురు బస్సులు ఎక్కారు.

సూట్‌వాలా, కళ్ళకున్న అద్దాలు తీయకుండా సీటు కొరకు వెదకుతుంటే కండక్టర్ "పాపం అతను గుడ్డివాడు. ఆ సీటులో కూర్చోపెట్టండి" అని అరిచాడు. అది గమనించిన రమణయ్య "అయ్యో! అతను గుడ్డివాడా! అందుకు తనకు సమాధానం చెప్పలేదా. అతన్ని అనవసరంగా తిట్టుకున్నాను" అని అనుకున్నాడు.

తరువాత తాను బధ్ధకస్తుడని అనుకున్న రెండో వ్యక్తికి మాటలు రావు. అంతకు సంజతు చేస్తు కండక్టర్‌తో మాట్లాడుతున్నాడు.

ఇక తనపై మండిపడిన వ్యక్తి చదువురాదు. అందుకు కండక్టర్‌తో "నాకు చదువురాదు. మా వూరు వస్తే దయచేసి నాకు చెప్పండి" అని దీనంగా కండక్టర్‌ని ప్రాదేయపడుతున్నాడు.

అంతా గమనించిన రమణయ్య, "అయ్యో! నేను అనవసరంగా పట్నాన్ని, పట్నవాసులను తిట్టుకున్నాను. పట్నంలో వున్న వాళ్ళంతా చదువుకున్న వాళ్ళు కాదని, చదువురాని వాళ్ళు ఇక్కడ వుంటారని తెలిసింది" అని తన తప్పు తెలుసుకున్నాడు.





# వ్యామోహం

పాండు రంగాపురంలో రంగయ్య శెట్టి అనే వర్తకుడుండేవాడు. ఆయనకు భార్యా ఇద్దరు కుమారులు. చిల్లర కొట్టు వ్యాపారం వుండేది. న్యాయబద్ధంగా వ్యాపారం చేసుకుంటూ అతిధి అభ్యాగతులను ఆదరిస్తూ భగవద్భక్తి కల్గి యుండేవాడు.

ఒకనాడు ఆయన ఇంటికి ఒక యోగి వచ్చాడు. వచ్చిన అతిథికి చక్కగా భోజనం పెట్టి నూతన వస్త్రాలు ఇచ్చి ఘనంగా సత్కరించాడు. ఆ యోగి శెట్టి గారి దైవభక్తికి అతిథి మర్యాదలకు ముచ్చట పడి "నాయనా! నీ దైవభక్తికి ఆనందం కలిగింది. నీకు ఈ జన్మలోనే మోక్షం కలిగించాలను కుంటున్నాను" అన్నాడు.

"స్వామీ! మీరు మహానుభావులు. మోక్షం ఇప్పిస్తామంటున్నారు. అంత కంటే నాకు కావలసినది ఏముంది. కానీ నాదో మనవి. నా బిడ్డలు ఇప్పుడిప్పుడే ఎక్కివస్తున్నారు. పిల్లా పాపలతో వారు సుఖంగా వుంటే చూచి ఆనందించి వస్తాను. దయచేసి మరోసారి రండి" అన్నాడు.

యోగి, "సరే! అలాగే మరోసారి వస్తాను" అంటూ వెళ్ళిపోయాడు. శెట్టిగారు కొడుకులకు వివాహాలు అయిపోయాయి. ఇద్దరికి కొడుకులు పుట్టారు. వ్యాపారాలు చూసుకుంటున్నారు. హాయిగా కాలాం గడుపుతున్నాడు. అయిదేళ్ల తరువాత యోగి మళ్లీ వచ్చి "ఏం నాయనా! మరి వెళదామా! మోక్షం ఇప్పిస్తాను" అన్నాడు.

శెట్టిగారు "యోగీంద్రా! నా భార్యా గతించింది. ఆమె తిరిగి మా ఇంటిలో మహాలక్ష్మిలా పుడుతుందట. ఆ ముచ్చటా చూచి వస్తాను. తమరు మళ్ళీ రండి" అన్నాడు. "సరే! నాయనా

కె.వి.ఆర్. హనుమంతరావు, హైదరాబాద్

ఈసారి మళ్లీ వస్తాను. అప్పుడు మాత్రం కాదన కుండా రావాలి" అంటూ వెళ్ళిపోయాడు.

అలా వెళ్లిన యోగి మరో పది ఏళ్ళ తరువాత మళ్లీ వచ్చాడు. శెట్టిగారు కన్పించలేదు. శెట్టిగారు ఎక్కడ అని అడిగితే ఆయన ఎప్పుడో చనిపోయాడు. ఇదిగో! ఆ పూరి ఇంట్లో శెట్టిగారు పెదకొడుకు ఉ ంటున్నాడు. అంటూ ఒక తోటలోని పూరిపాకను చూపించారు. వూళ్లో వాళ్ళు యోగి ఆ ఇంటివద్దకు వచ్చాడు. కొట్టంలో ఎద్దు ఒకటి ఎండుగడ్డి నములుతూ కన్పించింది. యోగి ఎద్దు వద్దకు వెళ్లి దివ్య దృష్టితో అంతా తెలుసుకొని తన కనుంతలము లోని నీళ్ళు ఎద్దుపై జల్లాడు. ఉలిక్కిపడి ఆ ఎద్దు తల ఎత్తి చూచింది. "ఏం నాయనా! వస్తావా వెళదాం" అన్నాడు. ఆ ఎద్దు "అయ్యా నమస్కారం. నా కొడుకులు తగాదాలతో ఆస్థిపాస్థులు అన్నీ పోగొట్టుకున్నారు. ఇల్లు వాకిళ్లు మేడలు మిద్దెలు అన్నీ పోయాయి. బ్రతకటానికి పెద్ద కొడుకు ఒక ఎద్దుబండి తోలుకుంటూ దానిపై వచ్చే కొద్ది రాబడితో భారంగా బతుకు ఈడుస్తున్నాడు. రెండో కొడుకు బర్రెగొడ్డును పెట్టుకొని పాలు అమ్ము కుంటూ బతుకుతున్నాడు. అలా చనిపోయిన నేను నా పెద్దకొడుకు పంచలో ఎద్దుగా పుట్టి వాడి జీవనోపాధికి ఆధారమయ్యాను.

నా భార్య నా చిన్న కొడుకు ఇంట్లో బర్రెగొడ్డుగా పుట్టి వారి బతుకు తెరువుకు పాలిస్తూ వాడిని బతికిస్తుంది. ఇలా చాలీ చాలని సంపాదనతో నా కొడుకులు ఇద్దరు బతుకు బండి లాగుతున్నారు. వారి జీవనాధారానికి ఆధారమైన నేను మీతో వచ్చేస్తే వారి బ్రతుకులు ఏంకాను! చూస్తూ చూస్తూ వారిని వదిలి ఎలా రాగలను స్వామీ! నన్ను క్షమించండి" అన్నాడు కన్నీళ్లు కారుస్తూ.

"ఆహా! వ్యామోహం ఎంత చెడ్డది. ఎవరి కర్మకు ఎవరు కర్తలు ఎంత వారికైనా విధిని దాటటం అసాధ్యం అనుకుంటూ వెళ్లిపోయాడు యోగి.



# సప్త మోక్ష పురములు

మానవ శరీరమందు ఉన్నటువంటి చక్రములు మోక్ష పురములందు నిర్దిష్టమైయున్నవి. వీటి విశిష్టత!

1. అయోధ్య - ఉత్త ప్రదేశ్ - రామ జన్మభూమి : ఇచ్చట సహస్రాకార చక్రము కలదు.
2. మధుర - ఉత్తర ప్రదేశ్ - శ్రీ కృష్ణ జన్మభూమి : ఇక్కడ ఆజ్ఞా చక్రము కలదు.
3. హరిద్వారం (మాయాపురి) - ఉత్తర ప్రదేశ్ - గంగానది హిమాలయముల నుండి సమతలములోనికి ప్రవహించు ప్రాంతం. ఇక్కడ విశుద్ధ చక్రము కలదు.
4. కాశీ - ఉత్తర ప్రదేశ్ - విశ్వేశ్వరుడు - పవిత్ర గంగానదీ తీరం. ఇక్కడ అనాహత చక్రము గలదు.
5. కంచి - తమిళనాడు - వాద్య పర్వతములకు దిగువనున్న (శివకంచి, విష్ణుకంచి) ఏకైక మోక్షపురం. ఇక్కడ స్వాదిష్టాన చక్రము గలదు.
6. అవంతిక - మధ్య ప్రదేశ్ - మహా శ్మశానము (ఉజ్జయిని) : ఇక్కడ మణిపురం చక్రము గలదు.
7. ద్వారక - గుజరాత్ - పూర్ణ కృష్ణుని నిలయము. ఇచ్చట మూలాధార చక్రము కలదు.

పై మోక్షపురములలో 3½ కేశవాంశు, 3½ శివాంశకు చెందినది. కాంచీపురం చేరి సగము, మోక్షపుర దర్శనం ఆరోగ్యకరం, మోక్షదాయకం.

**యు. కల్పన,** కందుకూరు

**Edited & Published** by B.V. Radhakrishna, No.60 (Old No.59), West Mada Church Street, Royapuram, Chennai-600 013. (25983004, 9003289838). Printed by B.R.Govindaraju B.Com., at 60/59, West Mada Church Street, Royapuram, Chennai-600 013.

